— ఓమ్ —

# దేశభక్తి



(సాంఘిక నాటకము)



గ్రంథకర్త

వనం శంకరశర్మకవి

పత్తికొండ. (కర్నూలుజిల్లా)

1939



వెల రు. 0—8—0









(సాంఘిక నాటకము)

మొదటికూర్పు 500 ప్రతులు

గ్రంథకర్త

**వనం శంకరశర్మకవి**

పత్తికొండ (కర్నూలు జిల్లా)

**1939**

పత్తికొండ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.



వెల 0—8

ఓమ్

# విజ్ఞాపన



మహాశయులారా !

నేనీసాంఘిక నాటకమును వ్రాయుటలో మూడవది, ప్రపంచమునఁగల ప్రజాళికి స్వానుభవముగా నుండునదియే గమనించి ముందట్టి దురాచారములు రూపుమాపుట ప్రతివారివిధియై యుండతగునని ప్రదర్శనమూలముగా తెలుప నిశ్చయించి నాటకరూపమున ముద్రించితిని. వున్నది వున్నట్లన్న ఉంటూరు అచ్చిరాదన్నట్లు కొందరికి వెగటగునేమో? ముందునకైన మంచిమార్గమున నడచుటకు వీలగునని నాతలంపు. సాధ్యమైనంతవరకు లోకానుభవముగా వ్రాశినాడను యింకను విశేషములు వ్రాయవలయునన్న నాటకము పెద్దదగునేమోయని క్లుప్తముగా ముగించితిని. భాషయందేమి, పద్యములందేమి, కీర్తనలందేమి, నెరసులు లేకుండ యుండవు. వానినెల్ల పండితులు, కవులు, సవరించి పునర్ముద్రణమున నాకు సవరించుకొనునట్లు తమ తమ సదభిప్రాయములను దెల్పునట్లు ప్రార్థించుచున్నాడను.

ఇట్లు గ్రంథకర్త,

వనం శంకరశర్మకవి
పత్తికొండ.
(కర్నూలు జిల్లా)

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషులు

| | | |
|---|---|---|
| 1 | పుల్లన్న.— | తందానవాడు |
| 2 | రామన్న | రైతులు |
| 3 | భీమన్న | |
| 4 | మురహరిశర్మ.— | కాంగ్రెస్ ప్రచారకుడు |
| 5 | శంభుశాస్త్రి.— | ముసలి బ్రాహ్మణుడు |
| 6 | ప్రభాకరుడు.— | ప్రచారకుడు |
| 7 | రామాశాస్త్రి | సదాచార బ్రాహ్మణులు |
| 8 | నృసింహదీక్షితులు | |
| 9 | సుబ్బావధానులు | |
| 10 | శివశంకరసోమయాజులు | |
| 11 | మల్లన్న | హరిజనులు |
| 12 | పుల్లన్న | |
| 13 | వెంకన్న | |
| 14 | సుంకన్న | |

## స్త్రీలు.

| | | |
|---|---|---|
| 15 | కళావతి — | శంభుశాస్త్రి భార్య |
| 16 | సరళ.— | ప్రభాకరుని భార్య |
| 17 | భరతమాత | |
| 18 | విమల | స్త్రీస్వాతంత్ర్య ప్రచారకులు |
| 19 | శారద | |
| 20 | సుశీల | |

# ఓమ్
# విజ్ఞాపన



మహాశయులారా!

నేనీసాంఘిక నాటకమును వ్రాయుటలో మూడవది, ప్రపంచ మునఁగల ప్రజాళికి స్వానుభవముగా నుండునదియే గమనించి ముందట్టి దురాచారములు రూపుమాపుట ప్రతివారివిధియై యుండతగునని ప్రదర్శనమూలముగా తెలుప నిశ్చయించి నాటకరూపమున ముద్రించితిని. వున్నది వున్నట్లన్న ఉంనూరు అచ్చిగాదన్నట్లు కొందరికి వెగటగునేమో? ముందునకైన మంచిమార్గమున నడచుటకు వీలగునని నాతలంపు. సాధ్యమైనంతవరకు లోకానుభవముగా వ్రాసినాడను యింకను విశేషములు వ్రాయవలయునన్న నాటకము పెద్దదగునేమోయని క్లుప్తముగా ముగించితిని. భాషయందేమి, పద్యములందేమి, కీర్తనలందేమి, నెరసులులేకుండ యుండవు. వానినెల్ల పండితులు, కవులు, సవరించి పునర్ముద్రణమున నాకు సవరించుకొనునట్లు తమ తమ సదభిప్రాయములను దెల్పునట్లు ప్రార్థించుచున్నాడను.

ఇట్లు గ్రంథకర్త,

వనం శంకరశర్మకవి

పత్తికొండ.

(కర్నూలు జిల్లా)

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషులు

| | పాత్ర | |
|---|---|---|
| 1 | పుల్లన్న.— | తందానవాడు |
| 2 | రామన్న | రైతులు |
| 3 | భీమన్న | |
| 4 | మురహరిశర్మ.— | కాంగ్రెసు ప్రచారకుడు |
| 5 | శంభుశాస్త్రి.— | ముసలి బ్రాహ్మణుడు |
| 6 | ప్రభాకరుడు.— | ప్రచారకుడు |
| 7 | రామాశాస్త్రి | సదాచార బ్రాహ్మణులు |
| 8 | నృసింహదీక్షితులు | |
| 9 | సుబ్బావధానులు | |
| 10 | శివశంకరసోమయాజులు | |
| 11 | మల్లన్న | హరిజనులు |
| 12 | పుల్లన్న | |
| 13 | వెంకన్న | |
| 14 | సుంకన్న | |

## స్త్రీలు.

| | పాత్ర | |
|---|---|---|
| 15 | కళావతి — | శంభుశాస్త్రి భార్య |
| 16 | సరళ.— | ప్రభాకరుని భార్య |
| 17 | భరతమాత | |
| 18 | విమల | స్త్రీస్వాతంత్ర్య ప్రచారకులు |
| 19 | శారద | |
| 20 | సుశీల | |



శ్రీరస్తు

# దేశభక్తి నాటకము.

## ప్రథమాంకము

### రాజవీధి



(కల్లుపెంట అల్లరిజనము)

(ప్రవేశం త్రాగుబోతు తందాన పుల్లన్న)

గీ॥ మహిని సంపూర్ణప్రేమనీ ♦ మద్యపాన
మెంతొరుచియని ప్రజలెల్ల ♦ సంతసమున
కన్నగానక ద్రవ్యముల్ ♦ ఖర్చుబెట్టి
త్రాగుచుందురు ధన్యులై ♦ తూగుచుంద్రు ॥

మాట— వహ్వా వహ్వా ఏమీ మద్యపానమహిమ, అమృతమునకన్న మిన్నయైనది యెంతపొగడినను తీరదు ప్రపంచమునకొందరు దీనిమహిమ గుర్తెరుంగక బలువిధముల దూషింతురు. ఏమిప్రయోజనము. దీనినీకీర్తి నెంచఁదగను. ఈదుకాణమే పవిత్రక్షేత్రము. ఈ సురాభాండమే అమృతసముద్రము. ఈ ప్రజలే అమృతమాత పుత్రులు. దీనిరుచి తెలసినవారలు అమృతమనియే తలంచి స్వర్గమనుభవించినట్లే యనుకొందురు.

దే శ భ క్తి

(1 అనుబంధము)

మా—ఆహాహా ఏమీసంతోషము. యెంత ప్రియాసముదాయము యెన్నికష్టములు గలిగినను యెంతదుఃఖము వచ్చినను యేమి దిక్కులోచక భీతిగల్గినను ఈ అమృతమును రెండు మూడు ముంతలుత్రాగిన అన్నింటిని మరపించును. మత్తుగలిగించును బ్రహ్మానందము గలిగించును. అహా దీని సారమనుభవించిన వాడుగదా స్వారస్యము గ్రహించును. (జనులనుచూచి ముందుకునడచి) జనులారా! యేమీకలకలము. యేమీనాట్యము చూడ చూడ నాకును సంతోషముప్పొంగుచున్నది. నేనిందులోజేరి తాండవమాడెదను.

(2 అనుబంధము)

(నిష్క్రమింతురు) (తెరబడును)

(ప్రవేశము రామన్న భీమన్న)

రామ—ఒరే బీమన్నా యింటివా? మనతెందాన పుల్లన్న యీ యెల్లమ్మతల్లిని యేమేమోపాగిడి యేమేంసొగసుగా పాడిండాడురా యీతల్లిని లోకమంతా కొలిసిండారంట సూస్తే నిజమనేతోసుతాది. లేకపోతే యింతజనము ఈడ యేలకలిసేతాంట

భీమ—ఔనన్నా యీ యమ్మదయ సాలాజనానికుండాలె లేకుంటే బూలోకం నడిసేదిలేదు. పెద్దోల్లని పేరెక్కినోల్లంతా ఈయమ్మకి బత్తులే, యెప్పుడూ వూగుతా తాగుతా తాండవ మాడుతానే వుంటారు.

తా—నిజము నిజము అబ్బబ్బో యెట్లాటిట్లాటోల్లు యీడ జమతారురా.

సీ॥ బామ్మకు సోమయ్య ♦ పంతుని కొమార్డు
యెల్లప్ప ♦ యీమెనే యేలినాడు

మ—యేలినాడంటే యేమిరా?

రా—మూడు నాలుగేల్లనుంచీ యీయనే ఇజారానేస్తుండామురా.

సీ॥ దోసిల్లతోడబ్బు ♦ దొంగతనమున దెచ్చి
సోకునపోల్ రెడ్డి ♦ సొరగినాడు

భీమ—బోతా గేవోడురా.

రా—ఇంతేగాదు.

సీ॥ వడ్డీలకిచ్చుచు ♦ వారితో మనదొడ్డ
దొర తాగిబూమిపై ♦ దొరలినాడు

భీమ—ఇట్లాటోల్లంతా గుసిపడిండంగానే మనకింతప్రియమైండేదిరా?
యీల్లందరిని బాగ కనుక్కుండావు రామన్నా

రా—ఇంగాయినుయీల్లో

సీ॥ మంత్రాలరామన్న ♦ మైమర్శిపడినాడు
ఉన్నియేమన్న బల్ ♦ ఊగినాడు

గీ॥ యెందరెందరో ఇందులో ♦ సందులేక
శేరి బల్ కుశాలతో తాగి ♦ శెప్పతరము
గాని మనబోటివాల్లతో ♦ కలసి మెలసి
గంతులేసిరి ఈతల్లి ♦ కరుణవలన

భీమ—అంతేరా, మనతల్లిదయ కన్నులకి పత్యచ్చంగా కనుబడేది·
కాని ఆయమ్మనిమాత్రం మానముపూరికే సూస్తుండామూరా

రా—ఆ అందుకేమరి, మనతల్లికి మన మైన దయ మస్తుగుండాది.
యేదీకొంచెం మనమ్మని కొనియాడుదాముఠా.

భీమ—కాని

(3 అనుబంధము)

రా—ఒరే భీమన్నా అంతా నిజమైనసంగతే సెప్పితివిగాని కొందరు
లోకంలో ఈయమ్మనిసూస్తే సరిపడక తాగేవోల్లని బల్ సుల
కన సూస్తుండారురా. వాల్లు మనల్ని మాలమాదిగోల్లకన్నా
కనీసంగాసూసి దగ్గరకు రానీరు.

భీమ—ఔరా, ఇప్పుడు లోకమంతా తారుమారౌతుండాదిలే! మనము ఈడ తానాసేపుగినప్పుంటే లావోల్లు వస్తుంటారు. ఇదిగాక దేశమంతా కాంగ్రెస్సోల్లు బయలుదేరి తాగేవోల్ల కాల్లుపట్టుకొని తాగొద్దని బతిమాలుతుంటారు. వాల్లు మనలనిసూసిన మనమానం గప్పకిపోతాదిరో! సిన్నగ ఈస్థలంయిడిశేది మంచిది. పోదాముర్రా.

రా—ఔనౌను తిప్పించుకోని తిరిగినోడుదన్యుడు (నిష్క్రమింతురు)

(తెరపడును)

(ప్రవేశం భరతమాత ద్వితీయరంగము)

(4 అనుబంధము)

భర—ప్రపంచమంతయు తలక్రిందులుగా నడచుచున్నది. ధర్మమడుగంటినది. సత్యము శూన్యమైనది. న్యాయమదృశ్యమైనది. సంతోషము మాయమైనది. నీతి మరుగైనది. అకటా యేమియు దిక్కులోచకున్నది, ఔను యెందుకిట్లయినది. పిన్నపెద్దలనుభావమే లేకున్నది. ఇక దేశమా పైరుపంటలు సన్నగిల్లె, బీదల కష్టములధికములయ్యె, జీవహింసలు మెండయ్యె, అవినీతియెక్కువయ్యె, దుష్ప్రచార మమధికమయ్యె, ద్రోహము పెరిగిపోయె. అయ్యో యెన్నాళ్లు ఇట్లుండవలె, నేభరింపజాల, జూడజూడ తాగుబోతు లతిసంఖ్యాకులైరి, వేలకొలది బీదల కుటుంబములెల్ల కూలుచున్నవి. దీనికెన్నటికైన పర్యవసానమున్నదా (తలూచించుచు) ఈయవస్థలెల్ల నే జూడలేకున్నాను. ఏమిసేతును, దుర్మార్గులను మోయలేకున్నాను. కట్టా, (కన్నీరువిడచుచు) ఓకలీ, నీప్రభావమంతయు నాపైననే జూపింపవలయునా, చూపించుటయేగాక ముప్పదిమూడుకోట్ల ప్రజలను ఒక్కసారిగా నేడిపింపవలయునా! ఏమన్యాయము, నేభరింపజాల, నాకుమిక్కిలి కష్టముగనున్నది (పైకిచూచి)

ఓవాసుదేవా!

కం॥ విపరీతమయ్యె కష్టము
లపరిమితంబయ్యె నీచ ♦ భావములకటా
తపియించుచున్న దానను
కృపతో మమ్ముబ్రోచి ధరణి ♦ కీర్తి గనుమా ॥

మా—మహాత్మా, మరచితివా! నాడు తెలిపిన నీతివాక్యము లేమాయె, అహా తలంచుకొన్న పట్టరాని సంతోషమేగల్గుచున్నది. ఏదీ, ఏదీ
శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచదుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

మా—యుగము మార్పయ్యెనా? లేక నీపల్కులు తలక్రిందులయ్యెనా? యేల జ్ఞాపకమునకు నీకు రాకున్నదో (నిదానించి) మరచితిని ఔను ఆకలివినీ వేగదా, అందులకే పరీక్షించుచున్నాడవు గాబోలు అట్లయిన నాటి పలుకులసత్యములే కానిమ్ము, యేమిఃజేసినను నీమహిమయేగదా.

(5 అనుబంధము)

మా—సహింపజాల, భరింపజాల, ప్రజల పాపాగ్ని చే నా దేహము మండుచున్నది, మనసు కుళ్లుచున్నది, హా దైవమా నీకు దయయేల గలుగకున్నది.

(ఆకాశమున ధర్మదేవత)

ధర్మ—ఓ భరతమాతా? నీవు జగత్పూజ్యురాలవు. సమస్తప్రాణులకు సంరక్షకురాలవు, ఏలదుఃఖించెదవు, త్వరలో నీకష్టములుతొలఁగును నీతనయులలో నొకడు భగవత్స్వరూపుడై,సత్య శాంతైకమత్య భావములతోజన్మించి లోకబాంధవుడై మిగులబాగడ్తనంది మహాత్ముడని పేరువడసి నీకు ముద్దుపుత్రుడై ప్రతిభవించును. అతనిమహిమ జగంబునంతయు వెలయును. అతని ఆజ్ఞ చీమమొదలు పిపీలికాది పర్యంతమునడచును. అతనిదివ్య తేజోశక్తినికనుంగొని ప్రజలెల్ల అతనికి లోబడియుందురు. సమస్తలోకములయందు అతనినే

దైవముగానెంచి పూజించుచుందురు. ఆతని చూపు, అతని దయ, అతని పల్కులు, అతని చర్యలు, చిరస్థాయిగా యశోవంతమై నిలచును. అతడే జగత్కర్త, అతడే పరమయోగి, నీవాలోచింపకుము. నీమనోభీష్టము త్వరలో నెరవేర్చును. నీపుత్రిలనెల్ల సుఖముగా గాపాడును. పుట్టియున్నాడు. పెరుగుచున్నాడు. భగవంతునాజ్ఞకై వేచియున్నాడు. అజ్ఞయైనది. త్వరలో రాగలడు, నమ్ముము, నమ్ముము.

భర — అమ్మా ధర్మదేవతా నిజమా, నిజమా, నీపూరక నన్నోదార్చుటకై మాటలాడుచున్నావా, యెవరు, యెట్టి వాడు, యే వంశీకుడు తెల్పుము.

ధర్మ — తల్లి యెంతటి అమాయకురాలవైతివి. నీకు తెలియని సంగతులా ఇవి అయినను.

గీ॥ వైశ్యకులమునజన్మించి ♦ వసుధయందు
గాంధిమాహాత్ముడంచు బల్ ♦ ఘనయశంబు
నొంది ప్రజలకు దేవుడై ♦ పొందికలర
ధర్మరాజ్యంబుగా సేయు ♦ ధరణినెల్ల॥

భర — ఆహా అహా సంతోషము, సంతోషము ధన్యనైతిని, ఏకచంద్ర ప్రకాశేన నక్షత్రైః కిం ప్రయోజనమన్నట్లు భారతమాతయగు నాకు యొకపుత్రుడిట్టివాడున్న చాలును. మిగిలిన నాపుత్ర పుత్రికాదులెల్ల నాతనిచే సుఖింతురు తల్లీ, నన్నానందింప జేసితివి. నీకనేక వేలనమస్కృతులు. (నమస్కరించును)

ధర్మ — తల్లీ నీమహిమ పరమాద్భుతము, నీకనంతసుఖములు గల్గుగాక, నీసుతాదులెల్ల శాశ్వతముగా భోగభాగ్యంబు లనుభవింతురుగాక నేబోయివత్తును.

భర — చిత్తము.

( తెరబడును )

(తృతీయరంగం. ప్రవేశం రామన్న-భీమన్న)
(6 అనుబంధము)

మా—(మీసాలు దువ్వుతూ) యే దేశం పాడై తేమనకేం యెవరు సెడిపో తేమనకేం ఏమైతేమనకేం మన అమ్మయ్యాదయ నిండావుంటే సాలు.
(ప్రవేశం మురహరిశర్మ)

ము॥మా॥ ఓరీ సోదరులారా! యేమీ యెగుళ్లు, యేమీ తూగుళ్లు, యేమీ పొర్లుదండాలు, యేమీ తొందరపాట్లు, అయ్యో, అయ్యో, మీ యిల్లెక్కడ, మీ భార్యాపిల్లలెక్కడ, మీరు సంపాదించిన డబ్బెక్కడ, నిలు నిలు యెక్కడికిబోతారు (చేయిబట్టుకొని) రామన్నా నీవు పెద్దరైతువే? యెంతటి నీచమునకు దిగితివి. పెద్దకుటుంబీకుడవే ఛీ ఛీ పెంటకేగి ఈ త్రాగుబోతనము నేర్చుకుంటివా? మీ తలిదండ్రు లెటువంటివారలు, యెట్టింటి వంశమునబుట్టి యెంతటి దుర్మార్గమునకు గడంగితివి నీవేయిట్లునటించిన నిన్నుచూచి మరెందరెట్లగుదురో, నాయనా దీనిచే నీకేమైన సుఖమున్నదా?

గీ॥ ధనమునసియించు భార్యను ♦ తాదులెల్ల
దుఃఖమొందుదురిల ప్రజ ♦ దూరుచుండు
కష్టములు పెక్కు ద్వేషముల్ ♦ గల్గుచుండు
త్రాగుబోతనమున మర్యాద ♦ తెఱగిపోవు ॥

మా—ఇంతేనా! ఇంకేమైననున్నదా, రమ్ము బోదము నీయింటివద్దకీడతు నురమ్ము (అని ఈడ్చును)

రా—యెవరయ్యా నీవు, మమ్మల్ని పట్టి నిలబెట్టి బుద్ధిశెప్పుటకు నీకేమధికారమున్నది, నీవు సెప్తే మా తిర్గం మేసుకుంటామా.

భీమ—కాదయ్యా, నీవేం బుద్ధిమంతుడవయ్యా మాబోటి మోటోల్లు కల్లుతాగితే మీవంటోల్లు బ్రాంది, విస్కీ, బీర్, సారాయీలు గొప్ప గొప్ప మొత్తముల్చిచ్చి తాగుతుంటారే! మీసంగతి బైటికిరాదు మా దిమాత్రం బోటేగిన బైలుపడుతాది.

రా—కాదయ్యా ముందు మీవోల్లకి బుద్దిసెప్పి బాగుపరసి ఔతల మాకిసెప్తే మేము యినేము, మేము తాగేఖర్చెల్లాకూడితే మీరొక

పూట కాఫీతాగిన మొలవుగాదు.

ముర—సోదరులారా! మీరు చెప్పనదంతయు వాస్తవమే, మీరనదగిన వి షయమే, బాగుగావన్నారు. మేము ముందుగా సవరించుకొనుచు న్నాము. మేముబాగుపడి మిమ్ముల్లను బాగుపరచు ప్రయత్నము చూస్తున్నాము. ఈతాగుడుతనముచేత గల్గుకీడులనేకములున్నవి.

గీ॥ తాగుబోతులన్న ♦ తగువారు జేరరు
మాటలాడకుందు ♦ మహినినీచ
పరులుగాదలంతు ♦ ప్రభువులు జూచిన
శిక్షలిచ్చుచుందు ♦ తక్షణమున ॥

మా—ఇంక ననేకములున్నవి. కొంతకు కొంతైనను ఈ దురభ్యాసము గల్గినవాడనుభవింపక యుండడు, ఎందులకు కష్టములపాలగుదురు, మీరుచెడునదిగాక మిమ్మల నాశ్రయించినవారలను, మీతో నున్నవారలను యేలచెడిపెదరు. నామాటవినుడు, దేశమును పాడు సేయకుడు, మీవంటివారల నుద్ధరించుటకై మేమెందరమో బయ లుదేఱియున్నారము. మీకాళ్లకుమొక్కెదను (అనిమొక్కును)

రా—ఒరే బీమన్నా యీళ్లు కాంగ్రెస్సోళ్లు, యీళ్లకి బో ఆగాయిత్యం, అయ్యో, అయ్యో, సామీ, సామీ, లెయ్యరి, లెయ్యరి మీ రు బావన్లు. గొప్పోళ్లు, మేము మీకాళ్లకిమొక్కి మాదోసంబా పుకోవాలె గాని మీరు మాకాళ్లకి మొక్కిన మాకు యెడ తెగని పాపంకట్టినట్లే, సామీ న్యాయంగాదు, పాపంకట్టకరి, భరించలే ము లెయ్యరి.

ముర—నాయనా? నాయందునీకు నిజమైప్రేమ, భక్తి యుంటే రేప టినుండి నేను తాగుటలేదని ప్రమాణముచేసిన నీకాళ్లువిడతు ను. లేకున్న విడువను.

రా—స్వామీ, మీరు లేయండి (లేవనెత్తి) నాకొక అనుమానంతోస్తాది దాన్ని సెప్తే మేము మీయిష్టప్రకారం వస్తాము.

మ. ర— యేమది?

రా—తాగేవోల్లంతా మానుకుంటే యీ యిజారాదార్లు మరి యీ దుడ్లంతా జమసేసుకునే సర్కారోల్లు, యీల్లసంగతెట్లు? ఇదంతా యెట్లవుతాదో, ఇదిగాక ఈయీతపెల్లెల్లా యేమౌతాయో బోయోశనగావుంది.

ము—తాగే వారలున్నచోగదా ఇవన్నియు యోచింప వలయును లేనిచో అన్నియు మార్పాను.

రా—కాదుసామీ? మీరు మమ్మల్ని బతిమాలకుంటే యీలాలుపాడించి బైరంగంగా అంగళ్లుపెట్టించిన సర్కారోల్లని, తప్పట్లుకొట్టించి తాగింపజేయు యిజారాదార్లని బతిమాలరాదా! వాల్లు యీఅంగల్లన్నీ తీశేస్తే మాకీ,మీకి, యేబాదలుండవు గదాంట.

ము—ఆ, అదేప్రయత్నము ఇప్పుడు జరుగుచున్నది. కొన్నిజిల్లాలయందు అంగళ్లు లేకుండాజేశినారు, మన జిల్లాలలనుకూడా ముందుగా అట్లేసేతురు. క్రమేణ దేశమంతా త్రాగుడుతనమే లేకుండుగను, సర్కారువారలే త్రాగవద్దని ప్రచారముచేయుచు త్రాగుడును రూపుమాపుదురు.

భీమ—ఆ, అట్లాయిన బాగుంటుంది సామోల్లు మంచియోచన సేసిండారురా, ఔను దీనికంతా అ గాందీమారాజునిలిసి సాలాకాలంనుండీ కష్టములంతా అనుభవించుతూ ఇట్లాంటివన్నీ సూసి, దేశమంతా బాగుపర్సాలని యోసించినాడు.

రా—ఆహా, కాంగ్రెస్‌వాల్లాయీల్లు, మనము ఆనాడు పచ్చపెట్టెల్లో వోటేస్తిమే , ఔ, ఔ, గాందీవోల్లంతా గెల్సినారని సెప్పిరి' వాల్లయితే తప్పక సేస్తారురా.

భీమ—వాల్లేమి సామాన్యులా, యెన్నెన్నో కస్టాలనుబవించినారురా! జైల్లల్లోవడిరి. లాటీదెబ్బలుతినిరి, బార్యాపిల్లలనియిడిసి తినుటకు తిండిలేక అల్లాడిరి, కొందరు సచ్చిరి, కొందరుదివాలామైరి.

రా—ఇదంతా మనకోసరమేగదా?

ము—అంతయు మీకోసమే, మీబాగుకొఱకే.

రా—సామీ, మీయిష్టానుసారము మేమిద్దరము తాగేది మానకుంటాము గాని, దేశమంతా నిలిసేదీ బోకష్టముబ్బా.

ము—నాయనలారా! ముందు మీరుమానండి, మిమ్ములనుచూచి అనేకులు మానుదురు. మానకున్న మేము కష్టపడి మాన్పుదుము. మీరుమాత్రము మేము త్రాగమని ప్రమాణము సేయుడు, నమ్మెదను.

భీ॥ రా॥ స్వామీ. ఇంకటినుంచి తాగము, (ప్రమాణము సేయుదురు) మాటతిప్పము, తప్పిన గొప్పనరకమునబడి సత్తాము. స్వామిద్రోయిలగుదుము.

ము—(సంతోషించి) సరేరండి. ఇదో, వీరే గాంధీమహాత్ములు, వీరే మనపాలిటి రక్షకులు, వీరే మనల నుద్ధరించువారు. దర్శింపుడు, భజింపుడు, స్మరింపుడు.

భీ॥ రా॥ (పటమునకు మ్రొక్కుదురు, పటముయుంచను)

ము—సోదరుల్లారా! చూచితిరా, ఇమ్మహత్ముని దివ్యజ్యోతిమహిమ.

భీ॥ రా॥ స్వామీ మేము ధన్యులమైతిమి, ఎంతగొప్పోడు, సంతోషము స్వామీ, యీన యీలోకంలో దేవుడేగాని మరోడుగాడు, పటములోనే యిట్లుంటే నిజంగా ఇతనినేసూస్తే మరెట్లుంటాడో, ఒకసారైనా దర్శనంసేసుకోని సామాలి, యీయననిసూడని బతుకులెందికి. (చేతులుజోడించి) గాంధీమహాత్మకీ జై

(7 అనుబంధము)

మా—మహాత్మా. నీవేదేవుఁడవు, నీకు బమ్మదేవుఁడు అయినన్నునిచ్చి దేశమును బాగుసేయునట్లు కొనియాడుము.దు

(తెరపడును)

(ప్రథమాంకము సమాప్తము)






# దేశభక్తి నాటకము.

## ద్వితీయాంకము

(శంభుశాస్త్రిగృహము)

(ప్రవేశం కళావతి) (ప్రథమరంగము)

(8 అనుబంధము)

కళా— గీ॥ ఆడవారలజన్మమీ ♦ యవనియందు
మిగుల నీచంబుగాదోచె ♦ మగువలింక
బ్రతుకగారాదు బ్రతికిన ♦ హితముగాను
స్వేచ్ఛగానుండుటర్హంబు ♦ సేమమరయ ॥

మాట— యేమీకాలమహిమ, నాబోటియువతులిట్టి దుర్వ్యవస్థలోం దు వారెందరున్నారో తెలియదు. శాస్త్రము లాపురుషుల పక్షమున నిలచినవి. నీతులాస్త్రీలపైననే సవారి జేయుచున్నవి, కాకున్న పురుషులకతి సంఖ్యాకవివాహములట, ఎందుకు? మావంటివారల త్రొక్కుడు తెంచుటకు, ఇదిన్యాయమా, పోనిమ్ము, సరియా సమానమా, చూచుకొనుటయైనా లేదా స్త్రీలస్వాతంత్ర్యము, ఈఅస్వాతంత్ర్యపుస్త్రీలేల జన్మించవలయునో, జన్మించిన, తలిదండ్రులిట్టి దురాచరణములకేల గడంగవలెనో, దరిద్రుకైననుసరియే, విద్యావిహీనుడైన

నుసరియే, వయోవంతున కొసంగగూడదా, యెనుబదేండ్లునిం
డిన ఈ ముదుసలికా నన్నొసంగుట. పోనీ తుదివరకు వానితో
నే కడదేరవలెనట, వానినెంతమాత్రము దూరరాదట, ఇదియే
శిక్షయుగాదా, యేశాసనముగాదు, (యోచించి) అందమూ,
చందమూ, సొగసా, షోకా, వయసా, ప్రేమయూ, యేదియు
నదృశ్యము. ఏమనుకొన్నను ప్రయోజనములేదు. గడచినదాని
కై వగచిన లాభమేమి. నాదురదృష్ట మీవిధముననున్నది. ఈ
ముసలిబడుగుతో యెట్లు సంసారము సేయవలయునో, మనసా
పృకున్నది. పోనీ మాతాపితృవులాజ్ఞానువర్తినియై యెట్లో కాపు
రమీడ్చుచున్నను ఈపాపిబడుగు నిరంతరము నాపై అనుమాన
ముతోనే నటించును.

సీ॥ కనులారదిలకించి ♦ కార్యమెఱుంగడు
యోర్పుతో నొకక్షణ ♦ ముండలేడు
అటుయిటుదిరుగిన ♦ వెంటనంటుచునుండు
పరులతో మాట్లాడ ♦ పండ్లుగొఱుకు
సొగసుజేసుకొనిన ♦ సుర సురలాడును
మంచిచీరలుగట్ట ♦ మండిపడును
కప్పురందినినచో ♦ కరకరలాడును
కురులు దువ్వుకొనిన ♦ గుర్రుమనును

గీ॥ దొడ్డికేగిన వెంటనే ♦ దిడ్డినుండి
తొంగిచూచును యెల్లప్డు ♦ దొంగవలెను
దృష్టినాపైననేయుంచి ♦ ధీరునిగతి
మీసములుదువ్వి నటియించు ♦ మేటిమగడు॥

మా — ఏమనుకొనందగును. ఇట్టిలక్షణములు గలవాడు సమానపుత్రో
డు మగండైన, మనంబునసంతసించి తలవొంచి పెట్టినబాధలెల్ల
ననుభవించి కాపురము సేయవలసినదే, తలంచుకొని యొకక్ష
ణమాత్రము వద్దకూర్చొన్న తాతవలె గానుపించును గాని

ధవుడని యొప్పకున్నదే, సతికిసౌఖ్యముగదా ప్రధానము, అవ
ల సంసారము, సౌఖ్యములేని సంసారము స్మశానముగదా, యె
ట్టి అరాజకము, యెంతటియవినీతి, నావయసునకు నాకు సం
ప్రాప్తించిన మగనికి లెక్కింప డెబ్బదిరెండు వత్సరములు లేడా,
కాని బ్రహ్మదేవుడీయనకు సంపూర్ణాయువొసంగియేయుండును
ఎందులకిట్టి వృద్ధవివాహము లీదేశమున నాచారముగానున్నవో
తెలియకున్నది. దీనిని రూపుమాప సమర్థులు లేరా! వారలకు
నావంటి బిడ్డలు లేకుందురా, ఇట్టి విషమకృత్యములను నాశన
మొనర్పక తీరదు. నాగతి నేననుభవింపక తీరదు. ఒక్కొక్కసాం
హైన యీడు జోడైన సంసారములను జూడ నామనసంతయు కు
ములుచున్నది. ఏమి సేయుదగును. కాని ముందుగతులెట్లున్నవో
ఇంతేగాక యెన్నివత్సరములనుండియో సదానందుడు ఇంటిలో
నుండి మాకుగల భూమి బుట్రలన్నియు విచారించుకొనుచు
ఇంటాబైటా తిరుగుతూ మిక్కిలిసంతోషమున మాట్లాడుతూ
కన్నులకింపుగా గనబడుచుండె, అతనినేవో కొన్ని నెపములు బెట్టి
దండించి,మనసునొప్పిగల్గించి ఈముదుసలి ఇంటనుండిగెంటెంచె,
అతనిదర్శనమే లేకుండ జేసె. నేనాతురతనొందక నింటగలవస్తువు
నెప్పటికైన వాడుకొనక తప్పదని నిశ్చయించియుంటి, ఈడు, జో
డు,అందము, చందము, సమానముగానున్నందునను వానిగుణగ
ణాదులన్నియు తెలిసియున్నందునను, యెట్లో ప్రేమచేత నామ
నోభీష్టము నెరవేర్చుకొందునని నమ్మియుంటి, (యోచించి)
అతడీనాటికి ఇల్లువిడచి వారమురోజులయ్యె, మరలనెట్లు రాగ
లడు, వచ్చునుపాయమును చూడవలె ఆతనియందే నామనసం
తయు లీనమైనది. అతనిని చూడకున్న నాప్రాణమెట్లోయున్న
ది. కాని ఆలోచించెదగాక.

కం॥ ముదితలు నెద్దినంబున
పదిలముగను సేయ నెంచ ♦ ఫలమౌను, సదా
ముదమును గల్గుటకై యిటు
విదితముగా సేయ నెంతు ♦ విహితముగాగ ॥

(9 అనుబంధము) (యోచనతో పఠించును)

(ప్రవేశం శంభుశాస్త్రి)

శం॥ మా॥ ఏమిది నాకళావతి కానరాకున్నది. చిత్రముగనున్నది. నేవచ్చినంతమాత్రమువనే ఎదురేగివచ్చి మిగులసంతోషమున మాటలాడునది, నేడు యిల్లంతయు నిశ్శబ్దముగనున్నదే. ఎందునకేగినదో, పాపము అది యేమిసేయును. వయసున చిన్నది. సిగ్గరి, స్ఫురద్రూపి, మితభాషి, సత్ప్రవర్తనవతి, ఇంతేగాక చదువరి, ఇట్టిలక్షణవతి నీకాలమున సమానవయస్కుడెవడైన సతిగాగ్రహించియున్న దీని యందచందములకు, దీని సౌఖ్యమునకు మేరయేయుండదు. అయినవిధివ్రాతదప్పింప నెవరికిసాధ్యము. నాకీ భార్య అయిదవది, ఇంతదాక గడచిన భార్యలకంటే యియ్యది మిగులగుణవతి, నాకు ప్రాప్తించవలసినదే కాదు నాభాగ్యము, ఇపుడు కామాదష్టగుణంభవేత్, అనునీతికి భయపడుచున్నాడను. ఎందుకన్న మేమిర్వురు సమానముగానున్న నేతొందర లేకుండెడిది. అది మార్పుగుటచేత యోచింపవలసివచ్చినది. ఇదంతయు తలంచుకున్న ముఖ్యముగా నాదియేతప్పు నేననుకొనకతీరదు. గంభీరమునకై దీనిని బాధించి నానాకమాటలని, హింసించుటతప్ప వేరేమియులేదు. స్వయంకృతాపరాధమును గుర్తెరుంగక దీరదు. వృద్ధత్వము సంభవించి సర్వాంగములు తొందరచిందరలగుచున్నవి చేతగాదు. అట్లున్నను చేతనైనవానికన్న హెచ్చుగా నొక్కొకసారి,

క॥ ఎప్పుడుదండనసేయుదు
కుప్పలుగాదిట్టుచుందు ♦ క్రూరతజూతుఙ్
తిప్పలుబెట్టుచునుందును
నిప్పులువెదజల్లునట్లు ♦ నీల్గగజూచుతుఙ్ ॥

ఒక్కక్షణమాత్రమూరకుండనీక నేలబెట్టి కాలరాచుచుందును. అనరాని మాటలనుచుందును, అతిభీకరముగ కన్నులెర్రజేసి తన్నువానివలె విజృంభించుచుందును. అన్నిటికిని అదియోర్చియూరకుండెడిది. (అటుయిటు దిరుగుచు) ఔను, ఇపుడెందునను

న్నది. ఇంటికెవరును రాలేదుగదా, సదానందుడు బొత్తిగావ
చ్చుట మానినాడు. వానిస్నేహితుడు కృపానిధికూడా వచ్చుట
లేదు. ఇటీవలనాకు కనుచూపు మధ్యమమైనందులకు కొద్దిచిక్కు
లుగల్గుచున్నవి. ధ్వనివినిన తప్పక గుర్తించగల్గుదును. యెట్లు
న్నను నాకళావతి దుర్గతిపరురాలుగాదని ఖండితముగా చెప్ప
గలను. ఏదీమరి, లోయింటిలోనేమైన పండుకొన్నదా, చూచె
ద (పోవుచుచూచును) ఆహా, నేనాడినమాటలెల్ల ఇదివినియుం
డునా, విన్నను స్పష్టముగా నర్థముగాదు. ముగ్ధ, యేమెరుంగని
ముదిత (కూర్చొని నిద్రలేపును) కళావతీ, యెమింతటి గాఢని
ద్ర (కళావతిపార్లును) లెమ్ములెమ్ము, అలసటగల్గెనా, వాకిలి తె
రచి ఇంటిలోనికెవరువచ్చునది పోవునది తెలియక నిట్లు పండు
కొనదగునా, చాలా ప్రొద్దయినది లెమ్ము, (లేవనెత్తి కండ్లు
తుడుచును)

కళా—(లేచి) నాధా సదానందునకు కబురంపితిరా?

శం— (వేళ్లుకొరకుకొని) యెందులకు?

కళా—రమ్మని.

శం—దేవీ కలువరించుచున్నావా? మేలుకొని మాటలాడుము.

కళా—కలవరింపుగాదు, నిజముగానే.

శం—ఇది నీకెట్లు తెలసును.

కళా—తెలియుటేమున్నది, మనయింటిలోవాడు మనగృహకృత్యమం
తా చూచుకొని మనలనుప్రేమతో జూచుచు మనయాదరణకు
పాత్రుడైనవాడు, వానికి కబురంపుటలో నేమున్నది.

శం—దేవీ, వానికంతయు మనము విషప్రియులమైతిమి, వాడు కడు
ద్రోహి, వాడుతలంచిన విషయమువిన్న వెంటనేవానిని తుపాకి
గుండుతో కాల్చినను దోషముగల్గదు. తల్లిలేనివాడని, అర్భకు
డనితలంచి కనికరించితిని.

కళా—నాథా, వాడేమిద్రోహములు జేసెను. పసివాడు, యేవోపొరపా
టునకొన్నితప్పులుచేసియున్న వాటినిక్షమించు భారముమనది.
అట్లుసేయక నేవియో మనసునందుంచుకొని సర్వవిషయముల
యందు బాగడ్డగనిన సదానందుని దూరముసేయుట ధర్మమా.

కం॥ మనచేతులారఁబెంచియు
మనమేయుపకారమొసగి ♦ మనమాదరముఁ
ఘనముగగాంచినపుత్రుని
మనమిటులఁ బీడుటెందు ♦ మర్యాదగునే ॥

శం—నీకుతెలియదు, వాడుతలంచిన ద్రోహమెరుంగవు. నీవు వినరా
నిది, నీకుచెప్పరానిది. సంసారము పాడుసేయు దుర్మార్గుడు.

కళా—ఆ—ఆ—నాథా, ఏమది, నాకుతెలియనిద్రోహము వాడేమిజేసె
ను, అయ్యో, పాపము వానిని మీరిట్లుదూరుట న్యాయముగా
దు, వాని సత్ప్రవర్తనాదులు వర్ణనాతీతములు.

సీ॥ క్షణమాత్రమునమీరు ♦ గనఁబడకున్నచో
జనకుండెటులబోయె ♦ ననుచు యడుగు
నొంటరిగానేను ♦ ఇంటిలోనుండఁగ
నమ్మాయనుచు పను ♦ ల్నడుగుచుండు
నొకమాఱుబిలచిన ♦ యోయనిపలుకుచు
జెప్పినపనులెల్ల ♦ సేయుచుండు
మనపైన వాత్సల్య ♦ ము గల్గినటియుంచు
ముదమున మనయింట ♦ మురియుచుండు

గీ॥ తల్లిదండ్రులు మీరంచు ♦ దలచుచుండు
మీరెనాకింకగతియని ♦ మీరకుండు
నేదియన్నచొ ప్రేమతో ♦ నొదగియుండు
ఇట్టిగుణవంతునెడబాయు ♦ టేమిహితవొ ॥

మా—ఇయ్యదిన్యాయమగునా? ఎంతమంచివాడు, యెంతటిసాధువు,
వానినేజూడకున్న మనసునకేదియో విచారము గల్గుచున్నది.
శం—తస్వీ, వాడు మనయింట నుండతగినవాడుకాడు, నీకు వానిసంగ

తులు తెలియవు అవన్నియు తెల్పినసీవే వానినిబహిష్కరింతువు

కళా—వాడొనర్చిన ద్రోహమేదియో తెల్పుడు, దాచకుడు.

శం—చెప్పరానిది, వినరానిది.

కళా—నాతోడనా? ఆలోచింపక దెల్పుడు.

శం—తన్వీ వినుము, ఒకనాడు నీవు ఇంట లేనిసమయమున నేను కొద్దిగా నిద్రజెందియుండ సుమారు సాయంకాలము నాలుగున్నర ఘంటలసమయమున తన స్నేహితుడగు కృపానిధితో కొన్ని సంగతులు ఆద్రోహి చెప్పెను. (గుటకలు మ్రింగును)

కళా—ఏమి యోచన, నిధానించుటేల.

శం—సాధ్యముగాని సంగతులు. (తలవంచుకొనుచు యోచించును)

కళా—ఇందున మనమిర్వురమేగదా యున్నారము.

శం—అట్టి మాతృద్రోహిని మరలనింట కాలుపెట్టనిత్తునా, కబురంపుదునా? (పండ్లుకొరకును)

కళా—మీరెందులకంత ఆయాసపడుతారు, నాకు తెల్పుటకే యింత శ్రమపడువారు, ఆనాడువాడు ద్రోహముసల్పినపుడు చూచి యూరకెట్లుంటిరో.

శం—మాటలనేను. క్రియాశూన్యము.

కళా—ఓహో, క్రియాశూన్యమైన ద్రోహము ద్రోహముగాదు. మరి తెల్పుడు.

శం—నేపలుకజాల, నీతి విరుద్ధములు.

కళా—ఇట్లన్న అబ్బా, నాకును మనస్సు విసుగుగల్గుచున్నది. ఎట్లైనను నాతో మీరు చెప్పక తీరదు. నేవినక తీరదు.

గీ॥ మగడు సర్వంబు దాచక ♦ మగువకెపుడు
తెలుపు ధర్మంబుగాన సం ♦ దేహపడక
జెప్పు యోచింతు, మరివాని ♦ తప్పితంబు
గాంచి, దండింతు నికటంబు ♦ కఠినముగను ॥

మా—పోనీ ఇకనైన జెప్పరాదా?

శం—(ఆతురపడుచు) దేవీ! వానినేమియు దండింపకుము, వానినిపలు కరింపకకుము, వానిని జూడకుము, వాడన్నమాటలు తలంచు కొన్న నతిఘోరము. కర్ణకఠోరము. మిగులపాపము. ద్రోహి, వానిని స్మరింపనేరాదు. (యోచించును)

కళా—నాథా, మీరు మనసులోనే యుంచుకొని పరితపింపకుడు, తెలుపుడు,

శం—ఇట్లువిను వాడన్నమాటలు, ఓరీ కృపానిధీ! మా కళావతి యంద చందము, హావ, భావ, విలాసము, కళారసికతలు, యేవనితల యందును లేవు. (కన్నీరు దుడుచుకొనును)

కళా—ఇయ్యవి ప్రతిపురుషుడు సహజముగా లెక్కింపదగినవే. క్రొత్తవేమియు లేవు.

శం—ఇంకనువిను, ఇట్టినుతి పాత్రమైన వనితారత్నము ఈబడుగుకు దుసలికెట్లు ప్రాప్తమైనదో, నాయట్టివానికబ్బియున్న రతీమన్మథులరీతి మెలంగి నిరంతరము సౌఖ్యవారాసిలో మునుంగకుం దుమా, నేజెప్పజాల, జెప్పజాల.

కళా—ఇంతియేనా, ఇదంతయు నందని పండులయూశ, ఔను మాట లేగదా, ఆవల.

శం—అందులకు కృపానిధి మిత్రమా సదానందా! నీవును కళావతియు నొకేయింటిలోనేయుంటిరిగదా, నీమనసునకొప్పియున్న సతీ మణిని వేగిర గ్రహింపక నిందాక నెట్లూరకుంటివి. పిచ్చివాడా ఈకాలపువాడవైయుండియు, ఇంత అమాయకుడవైయుండుట యాశ్చర్యముగానున్నది అనెను.

కళా—ఇందునచేమున్నది. వారిద్దరు యువకులు, యువకులొకచోట

గూడినయేవేవో కొన్నిలోకాభి రామాయణము లనుకొ
నుచుండుట సహజమే, మీరీ విషయములందారితేరిన వారలు
గారా, మీరావయసున నెందరిపై దృష్టిపారించి యెట్లెట్లునా
టకమాడితిరో జ్ఞాపకము లేదుగాబోలు. మీరేమి సా
ధూన్న్యులా, ఊఁ, పిమ్మట.

శం—అంతట సదానందుడు, కళావతి నన్నతిప్రేమతో జూచును. మిగు
ల సంతోషమున మాటలాడును. సైగలచే చిరునగవున నటిం
చును. పేరుతోనుబిలుచును. మరచినట్లుగా నావద్దనిలువంబడి
సతీపతులమైతిమాయని నొక్కి మాటలాడును. మోహపాశముల
ను నూటిదప్పక వేయును. అన్నివిషయములు వద్దకుపద్దుగా జేరె
ను కాని, మన్మథావస్థలు మాత్రము అమలుజరుగలేదు. అనెను.
(నేలకు తలవంచుకొని) ఛీ, ఇక నాజన్మమేల నేనెందులకు బ్రి
తుకవలె, తన్వీ, నీవువానికి మారుతల్లివిగావా? సహింపజాల,
భరింపజాల.

కళా—నాథా, ఇంతకేయింత ఆగడమా, ఇంత ఆగ్యాభటమా, ఏలమీ
కీపిచ్చితనము. ఇంతకే సదానందుడంతయు ననుభవించెనా, వా
డు వెంటనే ద్రోహియయ్యెనా!

శం—తన్వీ, నీవు పసిదానవు? కాలపరిస్థితులు నీవెరుంగవు, ముం
దువెనుకలు నీకు తెలియవు, వాడు నోటన్నవాడు క్రియమాత్ర
ము జరుపకూరకుండునా?

కళా—ఔను, వానికి తావుండవలయునుగదా? పోనిమ్ము, లోకమున
నొకయాచారమున్నది. యేమన వనితలసంభవముగ నటించిన
దానినెంతమాత్రము నిజమరయక వెంటనే బైటకీడ్చివేయుట

నాచారము నేటికిని జర్గుచున్నది. అట్లులేక కన్నకుమారు డేమో ద్రోహమొనర్చెనని వానిని బైటకుద్రోయుటయెం తటిన్యాయమో తెలియదు. వానిని ద్రోసి నన్నపనిందల పాలుజేసితిరి.

శం—దేవీ, నీవెట్లు అపనిందలొందితివి.

కళా—కొకున్న మెవరైన సదానందుని యేల యింటనుండి నెట్టితిరని న యేమిజెప్పఁదగును.

శం—నీవు యూరకుండుము.

కళా—ఊరకున్న వాఁడొనర్చినద్రోహమునే నొప్పికొనినట్లగదా!

శం—పోనీ వున్నదిజెప్పుము.

కళా—వానిపై లేనిపోనివిగల్పించి చెప్పినమాత్రముననే యీకాలము న నన్ను నీతిపరురాలని నమ్మెదరా?

శం— మరేమియు ననకుము.

కళా—బాగుజేసితిరి, కాని నామాటవినుము, ఊరకేపిచ్చి పిచ్చియను మానములను గల్పించుకొనకుడు. మీరు ముసలివారలు మన యింటిపనులెక్కువ. నేనా బైటకువెళ్లుదాననుగాను, ఏమైనగృ హకృత్యములకుకావలసియున్న వస్తువులను బజారుకువెళ్లి తెచ్చి యిచ్చుటకు మీచేతగాదు. మరియొకరు పనికిరారు, ఇదిగాక కిన్నకుమారుని దూరముచేసుకొనుట యుక్తముగాదు.

శం—మరెవరినైనా యేర్పరతును.

కళా—వాడున్నను యింతియేగదా, వానినిమాత్రము నీవునమ్మవుగా,

శం—పరుడుగదా, వానికి మనలనుచూచిన భయముండును.

కళా—నాథా, మీరటుదలంపకుడు, పరుఁడొనర్చుద్రోహమునకు హద్దు

పద్దులుండవు. ఇంటివాడట్లుసేయునా? నీకు కుమారుడుగాదా?

శం—నీకుమాత్రిమో?

కళా—లేదందునా, అందులకే సదానందుఁడవశ్యకమని చెప్పునది.

శం—అబ్బా, వానిని నాయింట జేర్పను, ఇంటనుండి వానిని వెళ్లగొట్టిన సంగతి చేశమంతయుఁదెలసినది. దేవీ, ఇది కలికాలము, లోకులుపలుగాకులు, ఇచ్చవచ్చినరీతి మాట్లాడుదురు, ఇంతియేగాక

గీ॥ యుక్తవయసులునొకచోట ♦ నుండరాదు
యున్న నొనగూడు సౌఖ్యముల్ ♦ యువిదలకును
యదియె ప్రాథాన్యమాగాదె ♦ యువనియందు
కుదిరియున్న కుటుంబముల్ ♦ గూలిపోవు ॥

కళా—నాథా, యేలయింతవిచారము. స్త్రీలయందింతటి యనుమానమెందులకో తెలియదు. పురుషులు తమతప్పు తామెరుంగరు. యెరింగినచో మమ్ముల నిట్లుసేతురా?

శం—కామినీ, నీకేమికొరంతగలదు. నీయిచ్చవచ్చినరీతి కడుపారఁదినుము. మనసార నిదురించుము, సంసారికి నింతకన్న నింకేమి కావలయును. రమ్ము, సదానందుని మాత్రిము స్మరింపకుము.

కళా—(దుఃఖించుచు) నాథా, నాపాలిటి కర్మదేవత నన్నీవిధమున, బాధించుచుండ యెవరినని యేమనుభవింపవలె, కానిమ్ము "మనోజవంతు మాండవ్యం" అన్నట్లు ఏదియో నిశ్చయించుకొని అనుభవింపదీరదుగదా? నావంటి యనాథనీభువి నుండరాదు. అటు తలిదండ్రులులేక ఇటుస్వాతంత్రిములేక జీవింపరాదు. యెందునైన సుఖమున్నదా, యెంతమంచితనముగ, యెట్టినమ్మకముగ, యెంతసత్ప్రివర్తనముగ కాపురముజేసినను నాపైన

అనుమానము నీకువదలదుగదా, యేల నానీతి, ఎందులకు నా ఘనత, ఇక నేనెట్టైననేగి యేభావియో యేచెరువో చూచు కొనుట యుత్తమము.

(9 అనుబంధము)

శం—దేవి కళావతీ, దుఃఖింపకుము. నీ మనోసంతోషమునకు కొఱంతలేక సంసారముసేయుము. కావలసినది యడుగుము. తనివిదీర వస్తువులంధరించుము. మనసార చీరలుగట్టుము. నీయిచ్ఛవచ్చి నట్లు భుజింపుము. మిగుల సంతోషమున నుండుము

కళా—ఔనౌను, యేవియో సవరింపుమాటలు జెప్పుకున్న సాధ్యము లేదు

గీ॥ తరుణులకు నెద్ది ముఖ్యమో ♦ ధాతమదిని
తలచకుండఁగ నీబోటి ♦ ధవుల నెల్ల
ముడిని వేసియు పరికించి ♦ ముదితలకును
పెక్కు దుఃఖముగలిగించి ♦ సృష్టి జేసె ॥

మా—దీనికంతయు ఆవిధాత బాధ్యుడు, నీవేమి జేయగలవు. పురుష సామర్థ్యమును సాధ్యమైనంత జూపుచునేయున్నావు గాని అది వ్యర్థముగామారుచున్నది. కానిమ్ము, నా దురదృష్టమే యీనీతి పరిణమింపవలసియున్నది.

(తెరబడును)

(ద్వితీయాంకము సమాప్తము)





శ్రీరస్తు

# దేశభక్తి నాటకము.

## తృతీయాంకము

(ప్రథమరంగము)

(సరళ ప్రభాకరుడు ప్రవేశము)

(గృహము) (రాటమును సరళ త్రిప్పును)

(10 అనుబంధము)

సర—నాథా మీరు ముతకవస్త్రములుధరించి దేశోద్ధారకులమని సభలు జరుపుతు ఉపన్యసించు టెందులకు?

ప్ర—స్వరాజ్యముకొరకు.

సర—అనిన స్వతంత్రముగదా?

ప్ర—అందులోనియర్థము విశేషముగానున్నది. ప్రభుత్వమువారు మనకన్ని విషయముల స్వతంత్రమొసంగుట, అనునదియే.

సర—ఇపుడు లేదా?

ప్ర—లేదనిగాదు, వున్నది. యితరదేశములవలె ప్రజాస్వాతంత్ర్యముగానుండవలెనని గోరుట.

సర—నాథా ఇది సాధ్యమగునా, యెన్నివేల సంవత్సరములనుండియో ప్రజాపరిపాలనసేయు ప్రభుత్వమొకేసారి ప్రజలకు స్వాతంత్ర

మిచ్చి వారలూరకుండదగునా, వారిట్లుండియే దేశమునజరుగు అరాజకములు, అల్లరులు, దొంగతనములు, హత్యలు, అపారముగా జరుగుచునేయున్నవి. అందులకు తగుశిక్షలిచ్చుచునేయున్నారు. ఇంక ప్రజాస్వాతంత్ర్యమే యైనచో దేశమధోగతి పాలుగాకమానదు.

ప్రి—పిచ్చిదానా అన్నివిషయములు బాగుగాయోచించి మొదలిడినాడీసంస్థ, యెవరనుకున్నావు, మన గాంధీమహాత్ముడు.

సర—ఆయన చాలాగొప్పవాడే, ఆయన పల్కులాచరణీయములే, ఆయనిడిన సంస్థగొప్పదే, ఆయనమనోభీష్టము నిరవేరునుగాని ముందు ఇంటగెల్చిగదా రచ్చగెల్వవలె, మీరందరు గొప్పవారలే, దేశభక్తులే, మీయింటి స్వాతంత్రితను మీరేయోచింపక దేశస్వాతంత్రిమునకు పరుగిడుచుంటిరేల? ముందు నేను మీయింటిదాననుగదా? మీకుగల స్వాతంత్రిము నాకొసంగునదేదీ, మీరెంతటి విద్యావంతులైననేమి, మీరెంత గొప్పవారలైననేమి, స్త్రీలనుమాత్రిము బానిసలుగానెంచి అతిసీచముగా చూచుచున్నారే, యేదీ, మీయందుగల యుదారత?

ప్రి—దేవి సరళా, మంచి ప్రిశ్నడిగితివి మిగుల సంతోషమైనది. కాని మీకు స్వాతంత్రిములేదా?

సర— యేమనుమ? వండుటకును, పాత్రిలుతోముటకును, పిల్లలగనుటకును, మీకు బానిసవృత్తి సేయుటకును, ఇంతియేనా మాస్వాతంత్ర్యము.

ప్రి—(నవ్వి) కాదు కాదు, మొన్నజరిగిన మహాసభలో స్త్రీలు పురుషులతోటి అన్ని సంస్థలయందు సభ్యులుగానుండుట, ఉద్యోగములను స్వీకరించుట స్వాధీనమైనవి మరియుప్రిత్యేకముగా స్త్రీలు విధవావివాహములు జేసుకొనుట, రజస్వలానంతర వివాహములు నిర్భయముగా సల్పుకొనుట. పురుషులతోటి తండ్రి ఆస్తిని భాగరిహక్కుల ననుభవించుటయు స్వాధీనమైనవి. మరికొన్ని

చర్చలలోనున్నవి. ఈవిషయములను ప్రచారమొనర్చుటకై యువతులును, యువకులును, యేరడ్పి దేశమునబయలు దేరి బోధింపుమన్నారు.

సర—సంతోషము, సంతోషము, ముఖ్యముగా స్త్రీలకు కావలసినవి షయములు రెండు. అతిబాల్య వివాహములుమాన్పుట, పురుషునితోడి సమానస్వాతంత్ర్యతనొందుట, ఇయ్యవి శ్రద్ధగా ప్రచారముసల్పి పుణ్యముగట్టుకొని దేశమును బాగుపరచుడు, లేకున్న యెన్నికుటుంబములలో కుములుచున్నవి. ముందీదురాచారములనమాన్పి ఆవల స్వాతంత్ర్యమో, స్వారాజ్యమో, మీ యిచ్చవచ్చినది సాధింపుడు.

ప్రి—నీవీవిషయములను ప్రచారమొనర్తువా? దేశము బాగుపడును. మిగుల కీర్తిని సంపాదింతువు.

సర—నాథా! నిక్కముగా నేప్రచారమొనర్తును. లేకున్న కళావతీ శంభుశాస్త్రుల కుటుంబముగతి యెట్లున్నదో? చూచితిరిగదా,

ప్రి—పాపము చాలాఘోరమైనసంగతి. ఆసుందరవతిని ఆముసలిబడుగు యెట్లుగ్రహించినాడో! బుద్ధిలేనిపంద.

సర—ఏమిసేయుము. తలిదండ్రులతిదరిద్రులై సనాతన ధర్మావలంబకులై అతిబాల్య వివాహమొనర్చిరి. ఆగడుసరిముసలి తనచేతకాకున్నను ఊరికె ఏపుకొనితింటాడు. ఆకళావతికి సదానందునిపై ప్రేమ, వానిని స్మరించుచుండెడిది. వానినిచూచి కాలమెట్లోజర్పుకొనునది. ఈసంగతి ఆముదుసలి యెట్లో తెలుసుకొని సదానందుని యింటనుండనీయక బైటకుగెంటించినాడు.

ప్రి—ఆముసలివాడేమి సామాన్యుడా?

సర—వానిబొంద. ముగ్ధయగు కళావతి త్రాడుతెంచుటకై జన్మించినాడు. వానిముఖముజూచిన యూరపందిలాగ కనుపడును. పాపము ఆమెదుఃఖమునకు మేరలేదు. ఆవెధవసన్యాసికెన్ని యేండ్లు ఆయువు విధినియమించినాడో?

ప్రి—ఏమిచేతమనుకున్నావు?

సర—చేశేదేమిటి, చచ్చినమరునాడే వీరేశలింగంగారి వితంతుశరణాలయములో చేరడం, తగుపురుషుడుదొరకిన వరొకసూత్రం గట్టుకోవడం చాలు చాలు లేకున్న మానవతులు పురుషుల సూత్రములప్రకారము నడచినమురిగిచావవలసినదే, కానిమ్ము నేనిందులో చక్కగాప్రయత్నించి నూతనభక్తిని గల్పించి స్త్రీస్వాతంత్ర్యమును స్థాపించెద.

ప్ర—సరే! నీప్రయత్నము సఫలముగాకమానదు. ముందుచేయవలసిన వెన్నియోగలవు. పోదమురమ్ము. (నిష్క్రమింతురు)

(కళావతి, శారద, ప్రవేశం)

(ద్వితీయరంగం వీధి)

(11 అనుబంధము)

క॥ మా—(బిందెత్రోవలోనుంచుకొని దుఃఖించుచుండును) ఎట్లుబ్రతుకుదును. ఎంతని సహింతును. యెవరితో మొరలిడుదును. యెట్లు నాకోర్కెఫలించును. అకటా, మనసంతయు సదానందునిపైనున్నదే, అతనిజూచు విధానమెట్లు ఛీ, ఛీ, ఈ ఆడజన్మయే మహాపాపమైనది. దీనికి యెప్పటికిని స్వాతంత్ర్యమే లేదు.

శా—(ప్రవేశించి) ఏమే కళావతీ, బహుచింతనొందుచున్నావు? అయ్యో కన్నులెర్రబడినవే, త్రోవలోకూర్చొని యేలదుఃఖించెదవమ్మా, యేమి నీకంతకష్టమగల్గినది. లెమ్మునాకుదెల్పుము.

కళా—యేమున్నదమ్మా, నాయింటిలోనిసంగతులు నీకు తెలియనివిగావు. సదానందుడు ఇల్లువిడచిననాటనుండీ వానిపైననే నామనసంతయు పరుగిడుచున్నది. వాడెచ్చటనో యున్నాడని విన్నాను. కాని ప్రాప్తహీనను. (దుఃఖించును)

శా—కళావతీ దుఃఖింపకుము కొంచెము యోదార్చుకొనుము.

గీ॥ మనసునందునవాని నే ♦ మఱక సతము
దలచుచుండుము సంప్రాప్తు ♦ డగును సుమ్ము
ఇట్టివెన్నియొ నేగట్టి ♦ పట్టుబట్టి
సఫలమొందినదాననే ♦ సారసాక్షి ।

మా—నేను విధవను అయిన మగువగోరిన కార్యము ఫలింపక బోదు. నేనెన్నియో సఫలీకృతకృత్యత నొందినదానను. నామాట నమ్ముము.

కళా—అట్లయిన శారదా, నాకన్ననీవు మిగుల యనుభవజ్ఞురాలవు. నాకు సదానందుడే అనుకూలుడగునట్లు యోచింతువా? నీకేదైనను సహాయము నొనర్తును.

శా—రమ్ము, యోచింతును లెమ్ము.

కళా—ఔనమ్మా, ఆలసించిన ఆముసలిపీనుగ మండిపడును.

(నిష్క్రమింతురు) (తెరబడును)

(వామనరావు ప్రవేశం తృతీయరంగము)

వా—(జాబుతో) (స్వగతము)

గీ॥ తండ్రిగ్రైకొన్న వనితను ♦ తనయుడిట్లు
సంగ్రహించుట ధర్మమే ♦ సరణిజూడ
కాలమే మారుపయ్యెను ♦ చాలభువిని
ధర్మమే లేదటంచును ♦ దలపవలయు ॥

మా—మహానరకము, కర్ణకఠోరము, దేశోపద్రవము, ధర్మరాహిత్యము, ఈసంగతినివిన్నచో యెట్టి కఠినహృదయుడైన నొవ్వకొనునా, కాని కాలమహిమ చెప్పతరముగానిది. అయిన నింకొకటి ఆలోచింపతగినది. ఏవిషయముగాని అరాజకముహెచ్చి దేశక్షోభము గలిగినగాని చక్కని మార్గమునకు దిరుగదు. ఇత్యాది ముందుకు మంచినడకయే నడచును. ముసలివారలకు బుద్ధివచ్చును. పడుచులు తమ యిచ్చవచ్చినట్లుగా నటింతురు. ధర్మవిరుద్ధమేయని మనసుకు నొప్పిగల్గుటతప్ప ఇట్టి దురాచారములు అడుగంటుటే పరమధర్మము. లేనిచో కళావతి యవస్థలు వినుటకు సాధ్యముగానివి. ముందుజరుగు మార్గములకు ఈమెయే ఆదర్శకురాలుగా నుండగలుగును. ఆమెనుచూచి నామిత్రుడు సదానందుడొనంగిన జాబునొసంగెద (ముందుకునడచి) కళావతీ, కళావతీ,

(కళావతి ప్రవేశము)

కళా—ఎవరు నన్ను బిలచునది. వామనరావు గొంతువలెనున్నది. (ముందుకువచ్చి నమస్కరించి) వామనరావు రా! లోపలికిరమ్ము కూర్చొనుము. మీ కుటుంబమంతయు క్షేమమా,

వా—అమ్మా కళావతీ, సర్వులుక్షేమమే, ఇంటనీవకతెవేయున్నావా?

కళా—ఔను, నీవెందుండివచ్చితివి. నీరాక మిగుల సంతోషమైనది. నీమిత్రుడగు సదానందునివార్త నీకేమైనఁదెలిసెనా? యెందున్నాడు సేమమా?

వా—అతనివార్త తెలుపుటకయ్యే ఇంటుకునేవచ్చితిని, అతను పత్త్రమొకటివ్రాసి పంపినాడు. ఇదిగో గైకొనుము. (జాబునిచ్చును)

కళా ఏమీ, ఏమీ, సదానందుఁడే వ్రాసినాడా? (జాబు గైకొనును)

వా—ఔను,

కళా—(కన్నులకువత్తుకొని చిరునగవుతో) సదానందా, ఏనాటికి దయగల్గెను.

సీ॥ కనులార నిను జూచు ♦ కాలమెన్నడువచ్చు
నోయటంచును మది ♦ నోర్చియుంటి
మనసార నీతోడ ♦ మాటలాడుట యెన్న
డోయని మది నెంచి ♦ యూరకుంటి
ముదమార నీతోడ ♦ పదిలంబుగనుముందు
గాన మనసార నే ♦ కోరుచుంటి
తనివిదీరగ నీదు దయతో ♦ కౌగలిగల్గు
నాయని మదికోర ♦ మల్గకుంటి
గీ॥ ఇంటనుండినవాడని ♦ పింపుకపంచు
ఫలముగల్గక బోదని ♦ భ్రమనుకోయుంటి
నీతిచే నీమహాభ్రమ ♦ నిలపినాడు
కోర్కెలను దీర్పగలవని ♦ కోరియుంటి॥

మా—ఆహా, వామనరావు, స్వయముగా నీజాబు నతడే వ్రాసెనా?

మరేమైనఁ జెప్పెనా? వాచకనే తెలిసికొందును.

వా—అమ్మా, అంతయు వివరముగా నా యుత్తరమున వ్రాసియుండ గలడు. నీవును అందులకు ప్రత్యుత్తరము వ్రాసి యెవరితోనైన ను పంపుము అతని నీవు త్వరగా ఎటులో చూచుట యుక్తము. నేబోయెదను.

కళా—(తాంబూలమునిచ్చి) వామనరావు నేనయుత్తరము వ్రాసి పంపుటకాలశ్యమగునేమో, అంతలో నాక్షేమవార్తలాతను తెలసుకొనుటకై ఈ రవలుంగరమును ఆనవాలుగ నొసంగుము. ఇదియే నామనవి. (ఇచ్చును)

వా—అమ్మా మంచిది. (నిష్క్రమించును)

కళా—(జాబును విప్పిచదవును)

శ్రీమతి కుంసుమశోభితురాలగు ప్రియభామిణియైన కళావతీ దేవికి;—

వయసున నాకన్న చిన్నదానవగుటచే ఆశీర్వాదములు.

నేను మీయింటనుండినదాదిగా మీయందెట్టి నటించితినో గుర్తుంగకుండవు. నీకును నాకనుగల ప్రేమానుబంధముల నిర్వారము గ్రహించియే యుందుము. నీగుణగణాదులను ఇందునవ్రాయజాలనుగా ప్రుటకు సంబంధము దూరమగుటచేత వ్రాయనైతిని. కాని నీమగడు నన్నతనిదుష్టాలోచనలచే దూరగ్రస్తుని జేసె, నీకును స్వాతంత్రము లేదయ్యె నీరూప రేఖ వయోలావణ్య కళాప్రవృత్తులను అప్పుడప్పుడు నాకు విశాలముగ గుర్తుయుంగజేసినందులకు సేమముపలేక నీయుత్తరమును వ్రాసితిని. నీ ప్రేమ నాపైననవరతము ప్రసరింపుచున్న నాటిభ్రమ నను బాధించుచున్నది. ఉపాయ్యపస్థగలించినది. మిగుల కాయలాగ్రస్థుడనై యున్నాడను. జ్ఞాపకార్థమై ఈజాబు నినుజేరుచున్నది. ఇందునకెట్లు నటింతువో, ఏమైననేమి, యీపనిమున నాకు సందర్శనమిత్తువని కోరమునిందద గాక

ఇట్లు, సదానందు.

కళా—(మూర్ఛనొంది తేరి) ఆహా ఎంతటి దుర్వార్త, నేనాతని నెట్లు జూతును. ఏవిధమునైనతనికి సేవజేతును. ఎట్లు అతనితో మాటలాడుదును. ఏమియుదిక్కుతోచకున్నది, అయ్యో విధియేమి సేయగలడో? అతని స్పర్శనాది సౌఖ్యములు గలుగకున్నమానె అతని దర్శనమైనను చాలును. చిరంజీవియై యెందుననో యుండినచాలును "బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు" నన్నట్లు అతని నెన్నటికైన గ్రహింపక పోను. అతని సౌఖ్యము దక్కపోను, (యోచించి) ఇది మంచిసమయము గదా, ప్రి

స్తుతము ఈముదుసలిమగనిబారి తప్పించుకొని అతనినిచూచుచు
ట్లు (కన్నీరువిడచుచు) హావిధీ, మాబోటియువతులపై నీకింత
తామసమేలగలిగె, సదానందుడేమి నీకపరాధమొనర్చె, అతని
యాయువునభివృద్ధిసేయలేవా? లేకున్న సర్వలక్షణసంపన్నుని
గా నేలనాతని జన్మింపజేసితివి. జేసితివిపో నన్నతనికేల సతిగా
సేయకపోతివి. మనస్సున నీవేదియోయోయించుకొని ఈముదుసలి
ని నామెడకుగట్టి నన్నతిదుఃఖమునముంచి అడవిలోగాచిన వె
న్నెలరీతి నామనస్సెల్ల గాల్పజేసితివే, ఇది నీకు న్యాయమా?
(మూర్ఛిల్లుచు జాబునుదూరముగ వేసును)

(శారద ప్రవేశము)

శా—(తిన్నగాప్రవేశించి దూరముగపడియున్న జాబునుగైకొని చ
దివి) కళావతీ, కళావతీ, నీరొట్టువిరిగి నేతిలోబడినదిగదే, యే
ల దుఃఖించుచున్నావు.

కళా—శారదా జాబును పూర్తిగాచదవితివా? సదానందుడు జీవించు
నట్లులేదు. చేవ్రాలుచూచితివా? వణకుచుచేసినట్లున్నది. అ
య్యో, అయ్యో, ఇంకెందుకు నాబ్రతుకు.

శా—అమ్మా యూరకె దుఃఖింపకుము. ప్రయోజనములేదు. ఇందుల
కుతగు ప్రత్యుత్తరమువ్రాయుము. నేతెలసుకొనివత్తును. నిదా
నించిన కార్యముచెడును.

కళా—శారదా నిజముగానీవు తెలసుకొనివత్తువేమే? అట్లయిన నా
కు మహోపకారివి. (జాబువ్రాయును)

శ్రీమనోహరా! సదానందా? నమస్కృతులు.

నీజాబుచూచి మిగులదుఃఖమొందితిని. విధిని నీయందనుగ్రహింపుమని వే
డి చిరాయువొసంగునట్లు గోరితిని. కాని నీవుకొంతవిశ్రాంతినొంది నాపై
ప్రేమమానకయుండుము. నీగుణగణాదులను నుతించివ్రాయుసమయమి
ప్పుడుగాదు. అన్నియుగ్రహించినవే? ఇంతకుమున్న మనమిర్వురి ప్రేమాను
బంధములొకసారి పెనగూడనందున సౌఖ్యవారాశి మనకతిదూరమయ్యె
అయిననేమాయె, భగవంతుఁడు నీకాయుఃప్రమాణమొసంగిన నామనోభీష్ట
ము నెరవేరకపోదు. నీఆశ్లేషసుఖమును అనుభవింపకపోను. ఎట్లో వీలుగ
ల్గినప్పుడు నినుజూతును. ఇంతియే నాప్రేమానుబంధ నమస్కృతులు

ఇట్లు నీప్రియభామిని (కళావతి)

మా—శారదా యీయుత్తరమెట్లు చేర్తువో, భద్రముగా పసలచేతఁబడ నీయక సదానందునకేనొసంగి అతనినిచూచి యోగక్షేమములు తెలసుకొని మాటలాడిరమ్ము, వేగిరరమ్ము, ఆలసింపకుము (జాబుఇచ్చును)

శా—త్వరగావత్తును. (నిష్క్రమించును)

(తెరబడును)

(శంభుశాస్త్రి పంచముపై పరుండుకొనియుండును)

శం—దేవీకళావతీ ఏమిటో ఇంతెదాక గుస గుస లాడు చుం టి వే మెవరితో?

కళా—మెవరును యిందునలేరే, మీయనుమాన మెన్నటికినిదీరదు.

శం—అనుమానముగాదు. భగవద్గీతయో, కృష్ణాష్టకమో, లేక నారాయణకవచమో, పారాయణము జేసితివేమోయని అడిగితిని.

కళా—అన్నియు జేసియే ఇక్కడికైనది.

శం—అబ్బా, మెప్పుడూ నీకి దేగాధ?

కళా—లేదులెండి మీవలెనున్న బాగుండెడిది. నాకు చిన్నవయసు, మీకు మిన్నవయసు, అన్నియు యుడిగినమీరు, అన్నియుయు బికిననేను, మనమిర్వురము సాగసైన దంపతులము. బ్రహ్మ ప్రత్యేకముగా మనకైయవతారమెత్తి ముడివేశినాడు.

శం—వేయకుంటే నీవు నాయింటిలో నుందువా?

కళా—అందుచేతనే యిట్లుయేడ్చేది. (తెరబడును)

(ప్రవేశం విమల, సుశీల, సరళ, భారతి)

ప్రబోధము (చతుర్థరంగము)

(12 అనుబంధము)

స-సోదరీమణులారా! మనమందరమును జేరి గాంధీమహాత్ముడు జెప్పినట్లు జేసిన మనభరతదేశములోగల యువతీమణులెల్ల బాగుపడుదురు.

విమ—ఏదిమెట్లున్నను ముందుగామన కళావతిని గూర్చి యోచింపవలెను.

భా—యేమేసరళా! ఆముదుసలి శంభుశాస్త్రిఇంకను బ్రతికియున్నాడా? దానిదురదృష్టము. కళావతికెవడు వైద్యుడుదొరకలేదాఏమి?!

సు—ఆముసలి నమ్మి యెవరితోనూ మందు పుచ్చుకొనేవాడుగాడు సుమా?

భా—కాచేవానికి మందెందులకు, కళావతి ఈకాలపుఆడుదిగాదు, తనచేతిలోనున్న స్వాతంత్ర్యను ప్రయోగించిన ఇట్టి యవస్థలు గల్గునా?

విమ—సాధ్యముగాదులేవే, దీనికంతయు ధైర్యముండవలె.

భా—యుండకేమి, కొన్నాళ్లు మగనితో సంసారము జేసిన ఆడుదానికి సంగతులు తెలియవేమే?

విమ—నీకిట్లాంటి వన్నియుఁదెలసును గాబోలు?

భా—తెలియుటేమున్నది, వైద్యులను కాస్తమంచి యనుకొన్న సమయానుసారముగా మనకార్యములు నెరవేరుచుండును.

(కళావతి ప్రవేశం)

భా—యేమమ్మా కళావతీ, మొన్న మీగ్రామమున శ్రీమతి విశాలాబాయమ్మ స్త్రీస్వాతంత్ర్యపు మహాసభ జరిపినదట, నీవువెళ్లి యుంటివా?

కళా—వెళ్లియుంటిని ఆచరణలో బెట్టుటకు సాధ్యముగాకున్నది.

భా—సందేహింపకు, నీయిచ్చవచ్చినరీతి సేయుము. మేమందరమూ తీర్మానములాచరణలో బెట్టించుటకయ్యె ప్రచారము సల్పుచున్నాము తప్పక నమలునకు తేవలయును. ఎందులకే భయపడుతావు? అందులకే అవైధవ ముసలిపందను గట్టుకొని కాపురము సేదుస్తున్నావు.

కళా—యేమిసేతునమ్మా నాకెవరును దిక్కులేరు. నన్నుకన సదానందుడు దూరమయ్యె.

విమ—ఏమీ వాడు సమ్మతించలేదా?

కళా—సమ్మతికేమిగాని సమీపమున లేడు. సమయము చిక్కలేదు.

భా—నీకనుకూలమగును. యోచింపకు,

కళా—అమ్మా నీబోటివారలందరు జేరి ఇట్టి విపరీతదురాచారములను నాశనమొనర్చినగాని పురుషుల పొగరణగదు. దేశము బాగుపడదు. పట్టుదలగ ప్రచారమొనర్చి పుణ్యము కట్టుకొనుడు.

భా—మేమందులకే వచ్చినారము. (పోవుచున్నారు)

(నిష్క్రమింతురు) (తెరపడును) (తృతీయాంకము సమాప్తము)



శ్రీరస్తు

# దేశభక్తి నాటకము.

## చతుర్థాంకము

(ప్రథమరంగము)

(కళావతి ప్రవేశము)

కళా—(యోచించుచు) శారద ఇంకనురాలేదు, సదానందునకేమి ముప్పుగల్గలేదుగదా, ఏమి భయముండదనుకుంటాను, అతడు సుఖముగా జీవించినగదా నాబ్రతుకునకు ప్రయోజనము.

(రాజభట్టువైద్యుడు ప్రవేశము)

రా—అమ్మా కళావతీదేవీ, అయ్యగారున్నారా?

కళా—ఓహో, భిషగ్వరుడే, రాజభట్టుగారూ రండి, కూర్చొనుడు. చాలారోజులనుండి మాయింటివైపునకు రావడమేలేదే?

రా—పనులు మెండుగాయున్నవమ్మా.

కళా—ఇదో అయ్యగారు పరుండియున్నారు. వారు కొంచెం నెమ్మదిగాలేరు. యేమైనపనియున్నదా?

రా—ఏమిలేదు వారికి రక్తవృద్ధిగల్గుటకై కొన్నిలేహములు కావలయునని ప్రస్తావించియుండిరి. అందులకై చూతమని వచ్చితిని.

కళా—(నవ్వి) భిషగ్వరా, మావారి వయస్సునకు తగులేహములేనా? ముసలివానికేమి రక్తవృద్ధియేమి, నిజముగా మీ లేహములు వారు కోరినరీతి పనిజేసునా?

రా—ఆ, ఆ, పనిచేసును.

కళా—అట్లయిన తాము చాలాగొప్పవారతే, సరే నాశరీర స్థితిని జూడుడు. (చేయిజూపును)

రా—(చేయిపట్టుకొని) అమ్మా ఒకే వైద్యుడు భార్యాభర్తలకు చికిత్సచేయకూడదు. పథ్యముంచుట కష్టము.

కళా—మావారెప్పుడును పథ్యమే, నేను అట్లే?

రా—అదేమి, రోగములున్నగదా పథ్యము, లేకున్నను పథ్యమేనా?

కళా—మరియేమున్నది.

గీ॥ రక్తవృద్ధిసేయు ♦ శక్తియౌషధములు
నుండవచ్చుగాని ♦ మెంకువయసు
నున్నవారలకది ♦ మిన్నగాపనిసేయు
సదియె తగ్గియున్న ♦ నంతసున్న ॥

రా—ఔను నిక్కమే.

కళా—వైద్యశేఖరా! నాకు రక్తక్షీణతగల్గించు లేహముగావలె. అదియు నీవద్దనున్నదా? (నవ్వి) పోనీ మావారు పుచ్చుకొను లేహములెవ్వి.

రా—అశ్వగంధి, ఊరపిచ్చుకల, మదనకామేశ్వరి, ఈమూడులేహములు నొకమాసము సేవించి పిమ్మట సిద్ధమకరధ్వజమును సేవించవలె. వాటిఫలమును జూపును.

కళా—పేర్లు బహుబాగాయున్నవి. కాని నాకును తగినదిఇత్తువా?

రా—అమ్మా నేపనికిరాను.

(శారద జాబుతో ప్రవేశించును)

శా—(ఇంటిలోనికివచ్చి) కళావతీ, కళావతీ, సర్వము శుభవార్తయే జాబును చూచుకొని అందులోని విషయములాచరింపుము. సక

లము నొనగూడును. నీవింకేమియు వార్తపంపకుము, (జాబు నిచ్చి) అన్ని విషయములందులో నేయున్నవి, చూచుకొనుము నేనువచ్చి చాలాసేపైనది. పోయివత్తును.

కళా—అంతయుసుఖమేగదా? యేమియుతొందరలు లేవే?

శార—లేవు, నీమనోభీష్టము నెరవేరును. (నిష్క్రమించును)

కళా—(జాబునుచూచుకొని సంతోషించుచు వైద్యునిచూచి) భిషగ్వరా! నాకొక సహాయము మొనర్పవలె నీవుకోరినదిత్తును. ఏమందువు?

రా—అమ్మా నాకసాధ్యమైనదైనచో ఏమిసేతును,

కళా—సాధ్యమైనదే, ఎవరికిని తెలుపకూడదు. నాతో ప్రమాణ మొనర్పవలెను. నాయువసలు నీకేమి తెలియనివిగావు. నేనిట్లేయె న్నాళ్లు దుర్వ్యవస్థల పాలుగావలెనో తెల్పుము. ఇదిగో చూడుము అనుగ్రహింపుము [జాబును ఇచ్చును]

రా—(జాబునుచూచుకొని) కళావతీ ఇంతకేనా నీప్రశ్న, సహజమే కాని నేనింటికి వెళ్లి తగుయౌషధమును తీసుకొనివత్తును. నీవు ఆలోచింపకుము,

కళా—ఆలసించిన కార్యభంగముకావచ్చును. నీవడిగినదిత్తును.

రా—వైద్యులకు ఆదియే ప్రధానము ముందే బహూకరింపదగును. కార్యమైనతర్వాత మరతురు.

కళా—కానిమ్ము (హారమునిచ్చును)

(వైద్యుడు నిష్క్రమించును)

కళా—(స్వగతము) ఏమిసాహసము. ఎంతటి ప్రేమ, ఔరా! దీనికన్న వేరు సాధనమేలేదు. ఈ బడుగుముదుసలి కాయిలాగ్రస్తుడై పరుండినాడు, యెట్లో ప్రపంచరీతిగ సేవజేసినట్లు నేనటించి వైద్యునిసహాయమున ప్రాణత్యాగౌషధమును వేయించి యావల సదానంద కళావతుల లీలావిలాసములే దేశమునకాదర్శముగా నిలచునట్లుజేసెద, ఇట్టి దురాచారములికముందు గలుగబోవు. పురుషులుతలలెత్తి జూడరు. ఈయుత్తరము

లోని సంగతులు ఒక్కొక్కటిగా గ్రహించిన తనివిదీరగ సౌ ఖ్యమునను భవించినట్లే యుండును. దీనినియితరులు వినదగినదిగా దు. క్రియచే యుత్తరాభిప్రాయము ప్రతిటితశమాగాక.

(13 అనుబంధము)

(నిష్క్రమించును) (తెరబడును)

(ప్రవేశం శంభుశాస్త్రి పరుండియుండును)

[కళావతి కాళ్లు పిసుకుచుండును]

శం—దేవీ కళావతీ, నాకు రోగమధికమగుచున్నది. మనయింటి వైద్యు డు రాజభట్టునైనా పిలపింతువా?

కళా—నిన్నవచ్చియుండెను. మీరు నిద్రపోతూయుండ నిద్రాభంగ మౌనని తలంచి అతనికి మిమ్ముల చూపింపలేదు. రమ్మనిచెప్పి నాను, వత్తునని ఖండితముగాచెప్పినాడు రాగలడు.

శం—సరే, దేవీ నీవింతదాక యెట్లోము చిక్కిర్తితో కాపురముఁజేసితివి ఇక ముందెట్లుందువో? నీవా అర్భకురాలవు, ఈకాలపుదాన వుగావు. ప్రస్తుతముగల కాలపరిస్థితులనుజూడ యెవరేమి ని న్ను మోసముజేతురో? యేమగుదువోయని నామనస్సునకు బెంగగల్గుచున్నది.

కళా—యేబెంగమీకు అక్కరలేదు. ఇంతదాక జరిగినదానికేమిజేసి తిరో? ముందుజరుగుదానికేమిజేతురో, యెల్లప్పటికి నాగతిఁతే

శం—ఇదో, సదానందునిమాత్రము నమ్మకు, వానిని దరిజేర్చకొనకు ము, నీవపకీర్తిపాలగుదువునుమా, యేమందువు.

కళా—ఇశ్శో, అబ్బా, ఇంకెందులకు మీకాలోచనలు. సదానందుడు మీకు ముందు జరుగబోవు కార్యములకైనా రావలదా?

శం—సరే, నీయిష్టము నేను వానిని పిలపింపను, నీవే యేమిచేసు కొందువో?

[రాజభట్టు ప్రవేశము]

రా—యేమండీ శాస్త్రిగారూ, ఎన్నాళ్లనుండీ ఈకామెలా? చేయి

చూపుదు. (చేయి చూచి) అమ్మా కళావతీ వీరికిరోగము ముది
గినది. ఇంతవరకు నాకేల చెప్పివంపకపోతివి. కాని ఒక్క ఘ
నౌషధమున్నది దానినిత్తును. (నవ్వి) ఎంత ఆయాసము, ఎం
తటిరోగము, చాలు, చాలు, ఈఔషధమొక్కటియే చాలును
అంతయు నివారణయగును. సుఖనిద్రజెందును. తొందరయుం
డదు. శాస్త్రిగారూ, మీకింకేమిభయము లేదు. మందు కళా
వతీదేవికిచ్చినాను. సేవించండి యోచించకండి.

కళా—(మెడలోగొలుసును వైద్యునకిచ్చి) భిషగ్వరా, ఈఆయాస
మెంతసేపటికి తగ్గును. వారికన్న నాకు యెక్కువ ఆయాసమ
గుచున్నది. నే చూడలేకున్నాను.

రా—(మెల్లగ) అమ్మా, సదానందునికీవార్త చెప్పిపంపితివా?

కళా—తామే వెళ్లి రమ్మనుడు ఆలశ్యము లేకుండా పంపండి. నేనొంటరి
దానను. ముందుజర్గుపని కాతదున్నచో లోటుండదు.

రా—సరే, అమ్మా ఒకగ్లాసులోనీళ్లువేసి ఆరతులం ఈమందునూరి క
లిపిత్రాగుము. ఎవరితోనూ చెప్పకుము. ఆలశ్యముసేయక
ఇమ్ము, సర్వము ముగియును. నేబోయివత్తును.

(నిష్క్రమించును)

కళా—(మందునూరి నీళ్లలోకలిపి గ్లాసు చేతదీసుకొని) (స్వగతం)
ఆహా, ఇదియేగదా నామనోభీష్టమును నెరవేర్చు పవిత్రరసము
ఇదియేగదా ఇకముందు సదానందునితో నేకీభవింపజేయు అ
మితానందరసము. దీనినీముదుసలి హృదయమునవేసెద. సదా
నందుడింకనురాకున్నాడే, (అటుయిటుచూచి మందునిచ్చును)

శం—(మందుత్రాగి) కళావతీ, కళావతీ, నాలుకపీకుచున్నది. పేగులు
మండుచున్నవి. ఇదిమందుగాదు. విషము—విషము ఓసీ కిరాత
కురాలా! యెన్నాళ్లనుండి మనసులోనుంచుకొని ఈపనిజేసితివే

గీ॥ ముసలివాడు సెప్పు ♦ ముగ్ధలజెండ్లాడ
నీచమానుగాదె ♦ నియతిలేక
నేను జేసికొన్న ♦ నున్నందులకునిట్లు
ననుభవించినాడ ♦ నంత్యమునకు ॥

హా, యిదియే దేశమునకాదర్శము, నాచరిత్రయే లోకవిదిత
ము, ఇత్యాదియే నాటకకళ ఇదియే లోకపావన చరిత్రము.
ఇటి దురాచారములు త్వరగానశించుగాక, స్త్రీ స్వాతంత్ర్యము
ప్రతిభాసించుగాక. (కృష్ణా, కృష్ణా అనిచచ్చును) (తెరబడును)
(సదానందుడు ప్రవేశం)

సదా—కళావతీ, కళావతీ, (తొంగిచూస్తూ ప్రవేశించును)

కళా—(ప్రవేశించి క్రీగంటచూచుచు సమీపించి) సదానందారమ్మా
రమ్ము, కూర్చొనుము యెందులకింత తడవానర్చితివి. నీయుత్త
రమునగల విషయములన్నియు నెరవేర్చితిని సఫలమయ్యెను.

స—నేను త్వరగానే వచ్చుచుంటిని. వైద్యులగు రాజభట్టుగారు వచ్చి
నప్పుడు నేనింటలేను. చీటివ్రాసి కిటికీలోయుంచి వెళ్లినాడు, నే
నువచ్చునరికి 3-4 ఘంటలైనది. చీటినిచూచుకొని తడవుసేయ
కవస్తిని. సరే అంతయు నెరవేరినదిగదా?

కళా—నీదయవల్ల నెరవేరినది. యెన్నాళ్లకుదర్శనము. ఏమో ఈము
దుసలి వెంటగట్టుకొని పోవువానివలెనటించి నిన్నును నన్నును
ఎంతెంతో బాధించి యేమేమోజేసి మనమిద్దరి ప్రేమ నతి
దూరముజేసి తుదకెట్లోజచ్చె.

సదా—కళావతీ అతడెంత ముసలివాడైనను పురుషధర్మము గంభీరము
గ నెరవేర్చుకొనియె, కాని, దుర్మార్గుడు అతనిచరిత్ర దేశమున
కు చక్కగా తెలసు.

కళా—తెలియకేమున్నది. కొంతకుకొంత తెలసియున్నది. మిగిలినదంత
యు నిక మన సమాగమమే తెలుపగలదు.

గీ॥ మగువతలచిన తలపులు ♦ మహినియందు
త్వరితగతితోడవాటినీ ♦ దైవమెట్లొ
తోడుపడిసేయు మనయందు ♦ దోషములను
గలుగకున్నచో సౌఖ్యముల్ ♦ గలుగుసతము ॥

సదా—ఏనాడో కాగలకార్యము ఈనాటికి ఫలించె, ధన్యులమైతిమి.

(తెరబడును) (చతుర్థాంకము సమాప్తము)





శ్రీరస్తు

# దేశభక్తి నాటకము

## పంచమాంకము

(ప్రథమరంగము)

(సరళ, విమల, శారద, కళావతి, సుశీల, ప్రవేశము)

(14 అనుబంధము)

సర—ఏమే కళావతీ నీమనోరథము నెరవేరెనా?

విమ—నెరవేర కేమున్నది. మనబోటివారలము పదుగురేకీభవించిన నెట్టిదైన నిలమనేమే.

శా—కాలము రావలెను. అంతదాక వేచియుండవలెను.

కళా—జ్ఞానమ్మా అందులకే నన్నింతయవస్థలో మునుంగజేసి మీరందరు స్వతంత్రముగా సౌఖ్యములొందితిరి. కాలమొకేరీతి యుండదని వేచి వేచి పరితపించితిని. యెట్లో భగవంతుడు నాపై కరుణించె. ఈశారద నాకెంతయో సహాయమొనర్చె.

విమ—అందులకే ఇక చిక్కులుండగూడదని మేమందరము దేశసేవ జేయ మొదలిడితిమి. కొంతవరకు ప్రజలు గ్రహించినారు. గ్రహించకున్నచోట్ల సత్యాగ్రహముసల్పి మాదారికి వచ్చునట్లు జేసితిమి.

శా—అమ్మా, వివాహములందును స్వాతంత్ర్యమందును మరికొంత మార్పు సేయవలయును

సర——యేమిటో చెప్పారు?

శా——వర్ణాంతర వివాహములుచేసుకొనుట, పురుషులతో భేదభావము లులేక నటించుట, ఇయ్యవి ముఖ్యమని నాతలంపు.

సర——బాగుగానేయున్నవి. వీటిని తీర్మానించకమునుపే కొన్నికొన్ని చోట్ల అమలుననున్నవి. తీర్మానమనవసరము. యెవరెవరియిష్ట ము, ఆక్షేపణలేదు. (తెరబడును)

(రంగడు, సంగడు, రాముడు, భీముడు, ప్రవేశము)

(15 అనుబంధము)

రం——ఓరోరే, మనము ఈకరువుకి నిల్వేదేమోనుల్ల, భూమి పండకపా యె,దొరలేమో పన్నులిడకప్తారి. మనమెట్లు బ్రతుకుతాముర?

సం——పిచ్చోడా! ప్రతిగ్రామంనుంచీ మాజర్లువాళ్లి బీదోల్లంతా న స్తుండారు, వస్తుండారు, వోల్లకంతా సర్కారోల్లని యేదైనా పనులుబెట్టించమని మనకాంగ్రెసోల్లంతా పట్టుపట్టిండారంట.

రా——సర్కారుపన్నుగూడా మాఫీసేయమని అడిగిండారంట.

భీమ——ఈకాంగ్రెసుమంత్రిగార్లు సర్కారులోకూకొని వూరికేలేరు. మనల్నిసూసి బల్ యోశన సేస్తుండారు.

రం——వాల్లు మంచోల్లేగాని, మనకొక్కటి సెడుపుసేసిండారురా? వా ల్లకి యీరుసి తెలిసింటేగిన సేయరుపాపం.

భీమ——తాగేది మాన్పించిండారుగవా? మంచిదేలేరా, పదిమందున్న ట్లుమనము. దేశమంతా బాగౌతాది.

రం——భీమన్నా, దీనికంతా గాంధీమారాజేగదా సేసింది, ఆయన బో గొప్పోడురా, అదో ఆడెవరో వస్తున్నటుండాది సూడు ?

భీమ——ఒరే, మన అముల్దారురా !

(ప్రవేశము భుజంగరావు, తహశీలుదార్—జవాను)

(రైతులు అందరు నమస్కరింతురు)

భు——(కాగితము చేతతీసుకొని) ఓరీ, రైతుసోదరులారా ! మీకురా బడినకరువును, మీకుగల్గిన కష్టములను, మీరనుభవించు దరి ద్రమును, అంతయుచూచి మీరు వోటిచ్చిపంపిన కాంగ్రెస్

కౌన్సిల్ మెంబరు మురహరిశర్మగారు మీతో మహజర్ చే యించి గౌర్నమెంటువారికి పంపినారు. వారు యథార్థము తె లసుకొని కాంగ్రెసువారియందు గౌరవముంచి వారిమాటలు నమ్మి మీకు శిస్తులుమాఫీచేసినారు. కరవు యెక్కువగానున్నం దున మీకు ప్రకృతము తిండికి జరుగునంతమాత్రముగా రోడ్లు భావులు, చెర్వులు, కుంటలు, కాల్వలపనులు ప్రారంభించి మీకు కూలీయిచ్చి కాపాడుదురు. మీకు గౌర్నమెంటువారు యిచ్చిన వుత్తర్వులోనిసంగతులు ఇవి వింటిరా?

అంగరు—అయ్యా, బతికితిమి, బతికితిమి, సాలాసంతోసము మీకు దేవుడు మంచిసేయని, స్వామీ, కాంగ్రెస్సోల్లు యెంతకాలమై నా వుండాలసిందే.

భు—ఇంతేగాక మీకు అప్పులబాధలుకూడా తగ్గించినారు. చట్టమేర్ప రచినారు. ఆచట్టమంతయును మీరెన్నుకొనిన నాయకు లే మీకు చెప్పగలరు.

అం—మరీమేలే, మాబీదోల్లని రచ్చించితేనే ధర్మమునిలబడేది

భు—మీకీసంగతి తెల్పుటకై నన్ను సర్కారువాళ్లు పంపినారు. మీ రేమి భయపడనక్కరలేదు. సుఖముగా కూలి నాలి చేసుకొ ని బ్రతుకండి నేపోయివత్తును.

(అందరు మొక్కుదురు) (నిష్క్రమించును) (తెరబడును)

స నా త న మ హా స భ

(దేవాలయం) (రాధాకృష్ణ విగ్రహం)

1 రామాశాస్త్రి, 2 నృసింహదీక్షితులు, 3 సుబ్బావధానులు.

4 శివశంకరసోమయాజులు శిష్యులు.

(వేదపనస చెప్పుచుందురు) (నమోబ్రహ్మణే)

శివ—అయ్యా, రామాశాస్తుర్లూ ఏమిటో కాలం చాలామార్పొతు న్నది. ఈ కాంగ్రెసువాళ్లంతాజేరి సనాతన ధర్మములంతా నాశనముజేయసాగిరి (1) హరిజనులు దేవాలయప్రవేశమట, (2) 14 సంవత్సరములు దాటువరకు బాలికలకు వివాహము

సేయకూడదట (శారదాఆక్టు) ఈ రెండును మన బ్రాహ్మణుల కే ప్రమాదకరమైనవి. ఇతరులనేమి బాధింపవు.

సు—ఏమి చెప్పుదు, మా అమ్మాయికి పదమూడు వత్సరములు దాటుచున్నవి. మేనల్లుడగు మోహనునకిచ్చి వివాహము చేతామన్న వాడింగ్లీషు చదివినవాడు. ఆక్టుకువిరుద్ధముగా నే వివాహమాడనంటాడు.

నృసి—మీకింతేనా, నా భావమరది సోమసుందరమూర్తి తహశీలుదారు ఇంటిముందరనున్న దఫేదారు హరిజనుడు రామన్న, స్నానానికి నీళ్లు తెచ్చిపోస్తాడు పరుపులు మొదలైనవి అన్నియు తాకుతాడు. పిల్లలని యెత్తుకదిరుగుతాడు.

రా—ఇదేమి అంతగా తొందరలేదు. నా రెండవకుమారుడు ఉప్పుసత్యాగ్రహమున జేరి లాఠీదెబ్బలుదిని జైలునకేగి నానాకయవస్థలుపడి పెండ్లిమాని యొక క్రిశ్చియన్ యువతిని పెండ్లాడి తాను చెడుసదిగాక నామూడవకుమార్తె బాలవిధవ ఇందిరను తోడ్కొనిపోయి వర్ణాంతరునకొసంగి యెవరి అనుమతిలేక నే పునర్వివాహము జేసెను. ఏమిసేయుదును చెప్పుకున్న సిగ్గుపోవును. మతిజెడును.

(అందరు చెవులుమూసికొని) శివ, శివ, పాపము నశించుగాక? ఇక బ్రాహ్మణవంశమే జన్మింపకుండుగాక.

ఆకాశవాణి—ఓ బ్రాహ్మణులారా! సనాతన ధర్మావలంబకులారా! కాలమునుబట్టి శ్రుతులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, మార్పుగల్గుచుండును. కాలమొకరీతిగా నడువవలయును. "కలౌపంచసహస్రాణి జాయతే వర్ణసంకరః" ఇత్యాది భగవద్వాక్యము. గీతాసూత్రము, జ్ఞాపకము జేసుకొనుడు. వర్ణాశ్రమధర్మములు మాయమైనవి. ఆద్యంతములేకమై జగమునకొక క్రొత్తవెల్తురు గల్గుచున్నది. నూతనయుగము ప్రారంభమై సర్వధర్మములు ప్రకాశించును. మీసోదరులగు నందనార్, కనకదాసు, మొదలగు భక్తులచరిత్రలను స్మరింపుడు కాలమును గుర్తింపుడు.

అం—(పైకిచూచి కన్నులుమూసికొని) అమ్మా ధర్మదేవతా! నీప ల్కులమృతములు, అట్లేయనుసరింతుము. ధన్యులము, ధన్యుల ము యేమాభక్తాగ్రేసరుల పవిత్రచరిత్రములు (నమస్కరింతురు

(హరిజనులు మల్లన్న, పుల్లన్న, వెంకన్న, సుంకన్న, ప్రవేశము)

(భజన) (16 అనుబంధము)

మ—ఓరీ సుంకన్నా, మనకు గాంధీమహాత్ముడు చెప్పినప్రకారము దేవునొద్దకుపోయి స్వామికి సేయాల్సినపూజలన్ని సేసివత్తము రండిరో? ఈదినం ముక్కోటియేకాదశి బలుమంచిదినము.

పు—ఒరే బాపనోల్లంతా సేరి వున్నారుగదరా?

సుం—వుంటె మనకేమిరా, మనపనిమనది. వాల్లపనివాల్లది.

వెం—ఒరే మనముసేసేపని కొందరికి బాగుండాది, కొందరికిబాగలే దు. అందులో ఈబామ్మలే మనలని ఛీరిపేదిరా?

సుం—ఇంక కొంతకాలందాటితే అంతా ఒకటైపొతామురా?ఏలయో శన రాండిపోదాము. (సమీపింతురు)

(భజన) (17 అనుబంధము)

న—నాయనలారా, మీరెవరు?

సుం—మేము హరిజనులము, దైవభక్తులము. మీసోదరులము.

రా—మీ రిందున రాతగునా?

సు—రాకేమి మీకేనా దేవుడు మాకులేడా?

రా—వున్నాడు, లేడనము. యెన్నడైనా మీరిట్లు వచ్చియుంటిరా?

సు—స్వామికి దయగల్గింది ఈనాటికిరమ్మన్నాడు వచ్చినాము.

శివ—ఒరే మీరు అంత్యజులు,గొడ్డుమాంసమును తినువారలు, ధర్మ ముదప్పి యీనాడు యిట్లునటించిన ఇదిమీకు న్యాయమా?

సుం—అట్లయిన మమ్మల్ని వద్దందురా! సూతాంమరి.

రా—సోమయాజులూ, మనమువద్దనిన ముప్పవాటిల్లును, ఇదంతయు ఆగాంధీమహాత్ముని నిరంకుశశాసనము. పరిశ్రమియ్యదియే ప్రజాచరణము.

శివ—ఔను, ఆగాంధీమహాత్ముండిట్టి అరాజకము గలిగింపవచ్చునా?

సు— పూరుకోవయ్యా, నోరెత్తినబాగుండదు. ప్రపంచమంతా ఆయన మహిమయే.

శివ—ఆ ఖంములకే అంతాయైనది. మన సుందరశాస్త్రి కుమారుడు నాగరాజరావు మాలపిల్లనే పెండ్లాడినాడుగా.

రా—అంత యెగిరిపడుతూన్న సుందరశాస్త్రి తుదకుయెట్లు మారినో చూచితివా?

శివ—యేంచేస్తాడు, ఆపదకి కొడుకు కోసరముకి మాలల్లో కలసేడు

రా—అంతటితో పూరకున్నాడా హరిజనసేవా ప్రచారంచేస్తున్నాడు.

శివ—ఇక విధిలేదు. మరొకదారిలేను. కులనాశకుడు, కులద్రోహి.

సు—అయ్యో సాములారా మమ్ముల్ని పోనియ్యరా?

రా—నాయనలారా, మేమేమియు చేయము యేమియు అనము. మీయిష్టము యేమైనాచేసుకొండి మేము వెళ్ళుదుము.

(లేవబోదురు)

సుం—(రామాశాస్త్రి చేయిబట్టుకొని) కాదయ్యా, శాస్తుర్లూ మేము ప్రవేశించడమూ మీరు యెల్లడమా, మేమంత పాపాత్ములమా? మేము పాపాత్ములమేయైన దేవుడు మమ్ముల్ని శిక్షించక యుడడు.

రా—ఛీ,ఛీ, మాజన్మనాశన మొనర్చితిరి. మమ్ములను పాడుచేసితిరి మా వంశములను యేటగల్పితిరి. మా ఆచారము లంతరింపచేసితిరి.

వెం—స్వామీ. ఇప్పటికికాలేదా? ఈదినమే యైనదా?

సు—ఒరే మీకింత జులుమేలవచ్చినదిరా? కాంగ్రెసువారలు మీకిచ్చిన హామియేగదా, పాపికాలము దుర్మార్గుల సంభ్రమము.

వు—స్వామీ మీకు మేము శిష్యులముగామా? మమ్ములని మీరింత నీచముగాసూడడము న్యాయమే అంటారా?

శి—కాదుకానీ అనాదినుండీ నడచుచున్నది.

మ—అదంతాగడిసింది స్వామీ! గాంధీమహాత్మునికి దయగల్గినది. ప్రభుత్వముువారి ఆజ్ఞయైనది.

సు—కాలమెవరికి నొకేరీతియుండదు మీకీకాలము మిగుల బలమొసంగుచున్నది కానీడు మీయిష్టను. అయ్యా శాస్తుర్లూ

సోమయాజులు, దీక్షితులు, మనమతమే నాశనమయ్యె. ఆ ఆకా
శవాణి ధర్మదేవత జెప్పినట్లు మనము యీయుద్యమమున జేరి
దేశమునకు పేదలతోపాటు సేవజేతము. ఈమార్గమే ముందుసర్వు
లకు శరణ్యమాగునని నాతలంపు ఆగాంధియే పరమాత్మస్వరూపుడు
పు—ఆ ఇదిబాగున్నది. మిమ్మల్ని మేముగురువుగా జేసుకొందుము
మీవెంట మేము మావెంటమీరుకలసి ప్రచారంచేస్తే హరిజనోద్ధ
రణ యుద్యమము బహుబాగాసాగుతు మంచిదారిగల్గుతుంది. ప్రజాసే
వజర్గుతుంది మీకు కీర్తి వస్తుంది. దేశము బాగు పడుతుంది. స్వామీ
మీరే దేశోద్ధారకులు, మీరేమాకు దేవతలు, మీరే మాకు తల్లి
దండ్రిలు, మేమేదో తెలిసితెలియక జేసినతప్పులెల్ల క్షమించాల
సిన భారంమీది, యికనుండి మమ్మల్ని అన్నతమ్ములవలె చూ
సి మంచిమార్గానద్రోసి రక్షించాలె స్వాములారా.
సు—కాదు రామాశాస్త్రుల్లా నిజంగా మనమాలోచిస్తే మాలమాదిగె
లులేని వ్యవహారమేమనకు జరగటంలేదు. పాపం వృథావాళ్లని[illegible]కిరా
నీక నేలకుత్రొక్కి లేనిపోని శాస్త్రాలనంతాగల్పించి పాడుచేశారు.
శి—ఆకాలంలో వీరలు మద్యమాంసాదులుదిని ఆచారవంతులకి విరోధంగా
నటించారు. అందులకు ఆనాటివారలంతా వీరలను బహిష్కరించారు.
పు—స్వామీ నిజమేయుండొచ్చు లేదనము, ఈనాడు మేమందరము మద్య
మాంసాదులు తినకుండా ప్రమాణాలుచేసి మానుకొని స్వామిని పూ
జించిన ఈకాలంవారు మీరు అప్పటివలెనే మమ్మల్ని చూడొచ్చునా?
రా—వింటివా సోమయాజులూ, మనపుల్లన్న మంచిప్రశ్న అడిగినా
డు. యేంచెప్తావు జవాబు, వాని మాటలమృతములు, వానియుద్దేశ
ము మిగుల పవిత్రము. వానినడక కడునీతి.
శివ—వారలట్లు నీతిమార్గానువర్తనులై దైవపూజావిధేయులై మద్యమాం
సాది దురాచార రహితులైనచో తప్పక వారలందరిని మనలోచేర్చు
కొని మన సమానమున హక్కులొసగి మనసోదరులవలెజూచి మనదారి
కివచ్చునట్లు నీతులుబోధించి గాపాడ వలసిందే?
రా—నిజమేనా? త్రికరణశుద్ధిగా మాట్లాడితివా?
శివ—యేమియు భేదభావములేదు. ఈరాధాకృష్ణులసాక్షిగ, నామనోభి
ప్రాయమును తెల్పితిని.

రా—సుబ్బావధానులు, దీక్షితులూ, మీ అభిప్రాయములేమి? యే మందురు.

దీ॥ సు—శాస్త్రులూ యే మాక్షేపణలేదు. "అహింసా పరమోధర్మః" యిట్టి ధర్మమార్గానువర్తనలను కలుపుకొనుటలో యింతకన్న వేరు ధర్మమున్నదా?

రా—శహబాస్, శహబాస్, ఇకనీలోకమున గల దురాచారములు, మతనిషేధములు. తారతమ్యాభావములు. స్పృశ్యాస్పృశ్యదోషములు, ధ్వంసమగుగాక? ఓకీ హరిజనసోదరులారా! నిశ్చలభక్తితో నిర్మలానందముతో మీరును, మేమును కలసి జగన్నాటకసూత్రధారుండగు శ్రీరాధాకృష్ణులను పూజింతిముగరండి? ఆలసింపకండి, రండి, రండి,

హరి—సంతోసము, సంతోసము, జై రాధాకృష్ణకి జై.

(అందరు పూజింతురు)

(17 అనుబంధము)

(రాధాకృష్ణులకృత్యలై గాంధవరము కనబడును)

(అందరు దిగ్భ్రమ జెందుదురు)

రా—ఓసోదరులారా! చూచితిరా యీమహిమ ప్రస్తుతము ఈజగమున నేనే గాంధిమహాత్ముస్వరూపమై సమస్తజనపూజ్యుండనై సర్వప్రజాను రంజకుడనై హరిజనోద్ధరణకు కంకణధారినై, యున్నానని తన దివ్యమూర్తిని జూపించె గమనించండి దర్శించండి

అందరు—ధన్యులము, ధన్యులము,

రా—ఓ మహాత్మా నీమహిమ గుర్తెరుంగక నీనీతుల ననుసరింపక నీవుజూపిన దారినడుపక యెవ్విధముగనో నటించి యేమేమో తూలనాడి యెవరెవరితోనో యెంతయో బాధలొందితిమి. మహాత్మా మాతప్పులెల్ల క్షమించవలయును. హరిజనసేవ తప్పక నొనర్తుము. అయ్యది యే పరమపావన చరిత్రగా స్మరింతుము. (అందరు నమస్కరింతురు)

రా—గీ॥ సర్వధర్మంబు లెఱిగిన ♦ సాధుమూర్తి
పరమపావన నీదివ్య ♦ భవ్యమహిమ
నేడు తిలకించినారము ♦ నీదు శక్తి
యుక్తి జగమున స్థిరమయి ♦ యుండుగాక

మా—నీకన్న వేరుదైవమేలేదు, నీవు సామాన్యుండవుగావు. అవతారమూర్తివై దేశోద్ధారకత్వమునకై వచ్చినపావనమూర్తివి లేకున్న

చం॥ యుగపురుషుండవునీవె యని ♦ యుక్తులు మెలందరు నెంచి భక్తితో
జగమునసీకు పూజలను సల్పుచు ♦ నీస్మరణంబు సేయుచున్
జగముడునీవటంచు మది ♦ సంతసమొందుచు నమ్మికోర్కెలున్
తగు నెరవేర్చుకొంచు ప్రజ ♦ ధన్యతనొందిరి సర్వకాలమున్ ॥

(18 అనుబంధము)

మా—మహాత్మా నీచరిత్రనెంతనుతించినను తనివితీరదు. దేశోద్ధారకా! తోడిసోదరుల మనోభీష్టములకొరకై యెట్టెట్టి ఇక్కట్టుల నెల్ల ననుభవించి భార్యా పిల్లలనువీడి కారాగృహవాసివై పడరాని బాధలనెల్లనంది చేయరాని పనులెల్లచేసి స్వరాజ్యలక్ష్మిని దర్శించి ఆమెతో యేకతియో విన్నవించి తుదకామె యొసంగిన అభయప్రదాన వాక్యములు దేశమునకంతయు నెల్లడించి వెలలేని కీర్తినంది ఇటుప్రజలు అటుదేవతలు ఆనందమొందునట్లు దివ్యతేజోమూర్తివై నిలచితివి. తండ్రీ నీనీతులు, నీప్రతిభాశక్తి, నీయుక్తి, నీవొసంగునాజ్ఞ యేమాత్రము చలింపక శాసనరూపమై, ప్రభుత్వామోదకమై, ప్రజాచరణయోగ్యమై సమస్తప్రాణకోటి కానందదాయకమై జగమున చిరస్థాయియై వెలయుగాక, ఓదీనబంధూ, మీకు భగవంతుండు సంపూర్ణాయువొసంగి సర్వసౌఖ్యములిచ్చి రక్షించుగాక. హరిజనోద్ధరణము శాశ్వతాభివృద్ధి యగుగాక. ఓ హిందూ సోదర సోదరీమణులారా? మనమందరమును దేశసౌభాగ్య

మునకై ప్రచారముచేసి దురాచారములన్నియు నాశనమొన
ర్చి సర్వసమాన సోదరత్వమభివృద్ధి జేతము. రండి, రండి దేశ
మునకు శ్రీ గాంధీమహాత్ముని ప్రియవాక్కులెల్ల దెలపి దేశ
మును బాగుపర్చుదము రండి సోదరులారా.

(19 అనుబంధము)

గీ॥ భారతీయుడనైన ♦ భరతమాతసుతుండు
మనసహోదరుండు ♦ మహితయశుడు
గాంధిమహాత్ముండు ♦ ఘన మహాపూజ్యుని
నుడువులన్ని వినుచు ♦ నడువరయ్య

మా—ప్రపంచమంతయు నీమహాత్ముని దివ్యజ్యోతిచే ప్రకాశితమై
సత్యధర్మసూత్రములు ప్రజాచరణయోగ్యమై చక్కనిమార్గ
ముల నడచుగాక.

జై గాంధీమహాత్మకు జై

(తెరబడును)

## మంగళం

(సమాప్తమ్)



# — అనుబంధములు —

(1 అనుబంధము)

తందనానతా తందనానతా తందనానతాన॥

పరివంచమున బల్ కీర్తి నిబొందిన పుణ్యక్షేత్రంబిదియే ।
నిరతముదీనిలో మునిగి తేలితె నిజముగ సంతోషంబిదియే ॥తం
బీదసాదలకు పెన్నిధియగుచుర తాండవమాడెను వహ్వా ।
మేదినిదీనికి సాటిలేదు మైమరపుసేయు వహ్వా ॥తం॥
దేవదానవులు దివ్యామృతమని సేవించిరి భైరీ ।
పావనులై బహుపేరుపొందిరిల బహుపరాక్రములు భైరీ ॥తం॥

(2 అనుబంధము)

అన్నలారా వినుడు మాయన్నలారావినుడు ।
మిన్నైనసంతోష మెన్నాతరముగాదు ॥అ॥
కన్నాతల్లీమనకు-బల్ వన్నైన యెల్లమ్మ దయకు, జగమునందున
ఘనజనులెల్ల నీ తల్లి దయసూడకుండిన బ్రతికేదిలేదన్న ॥అ॥

(3 అనుబంధము)

లోకాములోనున్న మోటాజనులాకెల్ల కన్నతల్లివినీ వెగా। మాయమ్మా
నీవేమాయమ్మావెగా॥ యెల్లమ్మ నీమైమ తెలసిందిగా ॥లో
యేకార్యమును జేసినా। నిన్నేమారకుండగనే । తొలుదొల్త నినుదెచ్చి
మాయింటనిలబెట్టి। నిజమైనబత్తితో నీకాల్లబడిమొక్కి ।
మాతల్లి మాయమ్మ మమ్ము రచ్చించని బతిమాలియేడుదుము
పరమపావనితల్లీ ॥లో॥
జోల్లతప్పెట్లతో సొగసుమేలములతో కొల్లు పొట్టేళ్లతో కొల్లబానా
లతో ఆడుతా పాడుతా తూగుతా నూకుతా నీవద్దజేరి నీ
కాల్లాబడుదుముతల్లీ ॥లో॥
యేరోగమొచ్చినా యేబాదగల్గీనా యేకట్టమొచ్చినా యేరేలేదే। నీ
మైమయసినమ్మి నీకుమొక్కని పోతుమేకలనిడిసినకాపాడితివితల్లీ॥లో

(4 అనుబంధము)

వైష్ణవజనతో తెనెకహియేజో పీడపరాయి జానేరే।
పరదుఃఖాకీ ఉపకారకరేతో మాన అభిమాననినారే।
సకలలోకమాసానే వంఛే నిందనాకరె కనేరే।
వాచకచ్ఛమన నిశ్చల రఖేధన, తెనజననీతెనేరే ॥వై॥
సమదృష్టినీ, తృష్ణత్యాగి, పరస్త్రీజనమాతారే।
జీవధకి అసత్ నబోలె, పరధన నవజాలెహాతారే ॥వై॥
మోహా, మాయా, వ్యాపీనహిజన ధృఢవైరాగ్యజనమవరే।
రామనామ సుంతాలిలగీ సకల తీర్థతనమార్యారే ॥వై॥
దానలోభిన కపటహితాచి కామక్రోధనివార్యారే।
భానెనరసయో తేనేదర్శన, కులయేకెతో తార్యారే ॥వై॥

(5 అనుబంధము)

భరియింపగజాల యీబాధల్ నే ॥భరి॥
ఈదురితముల గనినేవసియింపనసాధ్యమెగా ॥భ॥
కోట్లకొలది ప్రజలగచాట్లనుబడి తినుటకు కడుపారతిండి లేక। మాడు
చున్నసంసారములను నేజూచి సహింపగజాల జాలనే ॥భ॥
గంగాయమునసరస్వతిమున్నగు ఘననదులు ప్రవాహాములేక।
పంటలులేకను ప్రజలుమాడిరిల భాగ్యముసున్నై కరవిలనిలచె।
యెట్లుబ్రతుకవలె యేవిధితోచదు సర్వప్రాణులతి దుఃఖముతో
గుందుచున్నవి కూలుచునున్నవి దేశములెల్ల వినాశముయ్యె ॥భ॥

(6 అనుబంధము)

యెవరుంటేమనకేమి యేమైతెమనకేమి యెవరేమిసేసేరురా।
యెవరితో మనకేమి పనియేమి యెల్లమ్మ దయయుంటె యిక
సాలురా। మాయమ్మనీడలో బతికేమురా ॥యె॥
తల్లీపిల్లలుమనల దనమంతాదెమ్మనుచు తన్నీపీక్కుంటారురా।
సల్లాగయెల్లమ్మ పాదాలపైబడిన సంతోసమౌతాదిరా
మాయమ్మ సల్లగకాపాడురా ॥యె॥

(7 అనుబంధము)

నీదుదర్శనమమితపావనము మహాత్మాగాంధీ ॥నీ॥
లోకమెల్లనినుబొగడుచునున్నది శోకతోమముగాపాదుములుండి ॥నీ॥
జగమంతయు నీచేతిలోనున్నది జనసముదాయము నీలోనున్నది
రాజ్యతంత్రభారమునీయందున్నది నీమహిమమునుగానసాధ్యమె ॥నీ
సకలధర్మములు చాలుగనమవగ శాంతసత్యమైక్యంబులుగూడగ
సాహసుడవు నీచేతగాని దొకటైనలేదు నన్నిటినిసేయగల ॥నీ॥

(8 అనుబంధము)

నమోహిందుమాతా సుజాతా నమో జగన్మాతా ॥మాతా ॥న॥
అమోఘదివ్యామహిమనమేతా అఖండవర భరతఖండమాతా ॥న॥
వింధ్యహిమాద్రులె వేణీభరముగ గంగాయమునలె కంఠహారముగ ।
ఘనగోదావరి కటిసూత్రమ్ముగ కనులకుపండువుఘటించుమాతా ॥న
గోలుకొండ నీరత్నకోశమట కోహినూరు నీజడలోపువ్వట ।
తాజమహాలు నీదివ్యభవనమట ఆహా హా నీభాగ్యమెమాతా ॥న॥

(9 అనుబంధము) ఎ.

యేగతియోచింతునుహా ఏమియుదోచదు ॥యే॥
నామదికోరికలీడేరెటులో సదానందునేనెటులను
గాంతునో। ప్రేమభావములు కలియుటనెన్నడొ గాఢాలింగన
గలుగుటనెన్నడో ॥యే
మానవతికి తగినపురుషుడు మగడైనచొ దానిభాగ్యము, నుతియింప
నెవరితరముగాదు హరిహరాదులకైన ॥యే॥

(9 అనుబంధము) బి.

మానవతులాబ్రతుకేనీచము ఈమహిసఖి ॥మా॥
శీలయుతులు పరిశీలనసల్పక పతియెదైవమని భక్తితోనమ్మిన ॥మా॥
హరికివిభయపడి అవనిజనులకును మదిలోగుందుచు మర్యాదలచే ।
ముదిపెముతోసంసారమునల్పుచు మోదముతోవర్తించుచునుండిన॥మా

(10 అనుబంధము)

నీమహిమకనుగొనతరమా ఓరాటమా ॥మహి॥

సర్వజనులకును సన్నుతిరాలవు సకలసాధువుల పూజ్యరాలవు।
సర్వప్రాణికోటికి రక్షకురాలవు పుణ్యశీలయుతురాలవు ॥నీ॥
భరతదేశమున నిరతముజనులకు మానప్రాణరక్షకురాలవయీ
మురిపెముతో సద్భాగ్యభోగములనొసగి విలాసివిమైమెలగితి ॥వి
రహితనియందు స్వారాజ్యలక్ష్మివని రంజితముగనిను పూజింతురుగా।
ఇహపరాదులకు సింపగు నీదయగల్గినదొరగదె భాగ్యసుశీల ॥నీ॥

(11 అనుబంధము)

యెన్నాళ్లగతి ననుభవింతుహా దీ-ను-రా-ల-నే ॥నెన్నా॥
మన్నన లిని విని విచారించువారెవరైన గలరే గతిబ్రతుకుదు ॥యె॥
కాపురమునకరుదెంచిననాటను కరకరరంపముకోతయెగానీ। క్షణమా
త్రము మనసునసంతోషము గలుగ దేనీపాపపు జన్మముకిక ॥యె॥
అందచందముల హావభావములా సదానందుడేగ్రహించుననిమది
నమ్మియుంటి బల సమ్మతమున నాకోర్కె విఫలమయ్యెనకటా ॥యె॥

(12 అనుబంధము)

సోదరీమణులారావినండీ సులభమైన మార్గముజూడండీ ॥సో॥
జగమున మనయాడుజన్మములనతినీచముగాపురుషులుదలంతురో నె॥సో
పురుషులచేతిలోకీలుబొమ్మలని పూబోడులు కడుగృహబానిసలని
ప్రపంచజ్ఞానములేదనిమనలను అణచియుంటిలో మురగజేసిరిల ॥సో॥
గాంధిమహాత్ముడుకనుగొనియంతయు కాలముమార్పునుగలిగించెన్ ।
స్త్రీస్వాతంత్ర్యంబిల యవసరమనిచాటెను ధరపురుషులకోడన్ ।
స్థానికసంస్థలయందునగానీ రాజకీయ సభలందునగానీ ।
సభ్యులగుచు చక్కనిమార్గము సవరింపుకొనుడంచని తెలిపెను ॥సో
బాల్యవివాహములను మాన్పుండని బాలవిధవపెండ్లిండ్లను సేయగ ।
దేశమునన్ స్త్రీలందరు జేరి ప్రచారము జేసి దురాచారములన్ ।
దీక్షగ బాపుటతగునని మనలను దివ్యముగానతి మోదముతో ।

వేగిర దేశౌన్నత్యము గల్గించండని సాటెనుమహాత్ముడిలపై ॥సో॥

(13 అనుబంధము)

మేరలేనిసంతోషము తలచిన కార్యము కొనసాగినచో ॥మే॥
వనితలుకోరిన వైనభావములకు నెరవేరకయుండవు మదితలచిన ॥మే॥
కాలమునకు ముందునకట్టివి యెవ్వారున్నను నలుపంగబోవరిల । చాల
దుఃఖములు గడతేరెను నా సదానందవాత్సల్యముగలిగెను ॥మే॥

(14 అనుబంధము)

భారతీయులారా వినండీ భారతమాతనుగొల్వండీ ॥భా॥
భారతీయులము మనమందరమీ భరతదేశమునబుట్టినవారము ॥భా॥
ముతుకవస్త్రములు వేయండీ మరి మత్తుపదార్థములిడువండీ । అతి
హితముగ హరిజనులకూడుకొని అతిబాల్యవివాహములుమాన్పుడు ।
సతతముసోదర బుద్ధితో మెలగుడు శాంతిసత్యమైక్యమునవటింపుడు॥భా
స్త్రీలకుస్వతంత్రిమొసగండీ మనస్త్రీలకు స్వతంత్రిమొసగండీ స్థిరముగ
కాంగ్రెసుజేరండీ విధవలపెండిలుసేయండి మ ననరాట్నముతిప్పండీ
ప్రతినంస్థలలో భేదభావములు పారద్రోలుచు పరమపావనునిగాంధి
మహాత్ముని సూత్రములన్నియు ఘనమగుభక్తితోనలిపితరించుడి ॥భా॥
దేశసేవయే మానవజన్మకు దివ్యముక్తినొసగంగగలదుగా। వేషధారు
లై నూరకేయింటిలోకూర్చొని కాలము వృథాజరుపకిక ॥భా॥

(15 అనుబంధము)

బతకలేము బతకలేమయా ఓదేశభక్తులారా మమ్ముసూసిపోరయా॥బ
లోకమెల్లకరవుబుట్టె లోభితనము యెక్కువయ్యె। ధర్మమెల్లశూన్య
మయ్యె దారిద్రిముపెరిగిపోయె ॥బత॥
పన్నులధికమాయె మాకుపస్తులమితమాయె భూమిపండక
సంసారమెల్ల పాడుబడియె ఇంకేగతి ॥బత॥
కట్టుటకునుగుడ్డలేదు గుడుచుటకును కూడులేదు ।
తల్లిపిల్లలెందోబడి తల్లడిల్లుచున్నారిల ॥బత॥

(16 అనుబంధము)

జై రాధాకృష్ణకీజై జై, జై భారతమాతకీజై ।
జై, గాంధిమహాత్మకుజై జై, జై గోపాలకృష్ణకీజై ॥జై॥

6

గోవిందహరికీజై జై, జై గోపాలకృష్ణకీజై ।
జై రాధామాధవకీజై జై, జై భక్తపోషణకీజై ॥జై॥
జై హరిజనరక్షకీజై జై, జై ఆనందదాయకీజై ।
జై సదానందమునకుజై జై పరమపావనకుజై ॥జై॥

(17 అనుబంధము)

హరిజనసేవయే పావనము । ధరదీనిని మించినది లేదిక ॥హ॥
అంటరానితనమంతయు ద్రోయుచు నందరునొకటే సోదరులనిమది
వెంటనెతలచుచు వేగిరినందరు జేరి దేశసేవయును సేయుడు ॥హ॥
జన్మమెత్తుటలో సమానులమెగద కర్మచేత జాతులు వేరయెగద
అంతటికేమన మెల్లరు వేరయి పంతముబూనుట న్యాయంబౌనె ॥హ॥
భరతమాతకును సుతులమునందరు నొకటేయని పరికించునుగాదే
విపరీతముగను నటింపయోర్చినె విఫలముగాదె మనకోర్కెలునిల ॥హ॥

(18 అనుబంధము)

అపరాధములక్షమన్నింపుమా యో గాంధిమహాత్మా ॥మా అ॥
పామరులగుమముకృపతో గాంచుము నీదు మహిమ తెలియకనుంటిమి ॥అ॥
సకలలోకబాంధవుడవునీవే సర్వప్రాణిరక్షకుడవునీవే
సర్వధర్మస్థాపకుడవునీవే సతతముజగమున పూజ్యుడవీవే ॥అ॥
తెలిసి తెలియకను తూలనాడితిమి మాదుతప్పితములన క్షమియింపుము
ఇల పరమాత్ముడవీవెగాని వేరెవరున్లేరు ముమ్మాటికి లేరిక ॥అ॥

(19 అనుబంధము)

గాంధిమహాత్ముని పల్కులువినుడీ ఘనముగజనులారా ॥మనగాంధి॥
జగమునమనలను తనసోదరులని మనమున నెంచియు తగనికష్టములు
వగవక జైలునకేగియు లాఠీలతో దెబ్బలుతిని హింసనొందుచును
సత్యము శాంతము నైకమత్యమే ధర శాశ్వతమగుచును దెలిపెనుగా
ఒక్కసారిమీరందరు చక్కగనాతనిచరిత్రమును పరికింపుడు ॥గాం॥

మంగళము

—o—